అభినవాంధ్ర గ్రంథమాల
రాజమండ్రి

నాటక గుచ్ఛము
ఏడో సుమము

# లీలావతీసులోచనలు



శ్రీపాద కామేశ్వరరావు

అభినవాంధ్ర గ్రంథమాల
రాజమండ్రి

నాటక గుచ్ఛము
ఏడో సుమము

# లీలావతీసులోచనలు



శ్రీపాద కామేశ్వరరావు

# లీలావతీసులోచనలు

శ్రీయుత పి. సంబంధము మొదలియార్ గారి

అరవనాటకమునకు తెనుగు

పరిష్కర్త:

శ్రీపాద కామేశ్వరరావు

ప్రకాశకుడు:

చెఱుకువాడ వేంకటరామయ్య

అభినవాంధ్ర గ్రంథమాలా కార్యాలయము

రాజమండ్రి



1927



వెల ప్రతి 1-0-0

# పీఠిక

మన దేశభాషలలో తమిళ (అరవ) ము అతి ప్రాచీన మనిన్నీ తత్సారస్వత మతిపురాతనమనిన్నీ అందరూ ఎరిగిన విషయమే. ప్రకృతమున ద్రావిడ భాషలలో దీనికి విశేష వ్యాప్తి కద్దు; నాటక వాఙ్మయమున కూడా ప్రశస్తి ఉంది. అందు విఖ్యాత న్యాయమూర్తులు, నటులు, కవులునగు శ్రీయుత రావుసాహెబు పి. సంబంధము మొదల్యారుగారు రచించిన నాటకములు జనప్రియత్వము పడసినవని విని వాటిలో కొన్నిటిని తెనిగింప ననుమతి వడసినాము. మాకీ భాషాపరిచయము లేనందున మా మిత్రులచే దీని ననువదింప జేసి భాషనుమాత్రము పరిష్కరించితిమి.

కవిగారికిని అనువాదకులకున్నూ కృతజ్ఞతాపూర్వక వందనము లర్పిస్తున్నాము.

రాజమండ్రి
జనవరి 1927

చెలుకువాడ వేంకటరామయ్య
ప్రకాశకుడు.

# నాటకమండలి పాత్రములు.

## పురుషులు.

| | | |
|---|---|---|
| వాసవదత్తుడు | ... ... | పాంచాలదేశపు రాజు. |
| శ్రీదత్తుడు | ... ... | వాసవదత్తుని కుమారుడు. |
| ప్రతాపశీలుడు | ... ... | ,, తమ్మునికొడుకు. |
| పరాక్రమకేతు | ... ... | హస్తినాపురపు రాజు. |
| కమలాకరుడు | ... ... | శ్రీదత్తుని స్నేహితుడు. |
| కరుణాకరుడు | ... ... | రాచబారి. |
| విక్రమవీరుడు | ... ... | పాంచాలదేశపు సేనాని. |
| గుణసేనుడు | ... ... | వాసవదత్తునిభవనాధికారి. |
| విచిత్రశర్మ | ... ... | విదూషకుడు |
| దంతవక్రుడు, దుర్మతి | ... ... | పరాక్రమకేతునౌఖరులు. |
| సారంగుడు | ... .. | బాటసారి. |

## స్త్రీలు.

| | | |
|---|---|---|
| చిత్రరేఖ | ... ... | వాసవదత్తుని రాణి. |
| కాంతిమతి | ... ... | పరాక్రమకేతు భార్య. |
| లీలావతి, సులోచన | ... ... | ,, కూతుళ్ళు. |
| పద్మాక్షి | ... ... | శ్రీదత్తుని అక్క. |




# మొదటి అంకము

## మొదటి రంగము.

పరాక్రమకేతుని ఉద్యానమున లీలావతి
మరికొందరున్ను కూర్చుందురు.

లీలా—పద్మాక్షీ! వచ్చింది మొదలు సులోచనను విడువకుండా అదేపనిగా మాటలాడుతూనే ఉన్నావు! ఇంత సేపూ మీరెక్కడున్నారు? ఏమిటా ప్రసంగము?

పద్మా—అబ్బే, ఏమి మాటలున్నవి? ఇద్దర మా తోటలో గవ్వలాడుకొంటున్నాము.

సులో—అమ్మా, పద్మాక్షి రేపే వాళ్ళఊరు వెళ్ళవలెనంటూన్నది. ఇంకా నాల్గైదురోజు లుండమనవూ?

లీలా—అబ్బో, వీళ్ళిద్ద రింతలోనే ప్రాణస్నేహితు లయినారే! పూదోటలో ఒకరినొకరు అది ముద్దులాడుకొనడము కాదు. ఏదో విశేషమున్నట్లున్నది.

శాంతిమతి—సమస్కారం, పద్మాక్షీ- రెండుమూడు నాళ్ళుండి పోకూడదా ? ఇంతలోనే తొందరగా ? నేడేకదా వచ్చినావు !

పద్మా—మావాళ్ళు నన్ను శీఘ్రమే రమ్మన్నారు.

(పరాక్రమ కేతు వచ్చును.)

పరా—ఓహో ! పద్మాక్షీ ! నిన్ను చూచి చాలా కాల మయింది- ఇన్నాళ్ళకు మామీద దయపుట్టిందా ?

పద్మా— మిమ్ము చూచి చాలానాళ్లైనట చేతనే ఒక్కసారిచూచి పోదామని వస్తిని.

పరా—మీతల్లిదండ్రులకు బంధువులకూ క్షేమమా?

పద్మా—మీ కృపవల్ల అందరికీ క్షేమమే మావా ళ్ళందరూ మిమ్మందరినీ చాలా అడిగినామని చెప్పుమన్నారు.

పరా—మీతమ్ముడు సుఖమై ఉన్నాడా ?

పద్మా—మీ కటాక్షమువల్ల ఆతడు సుఖియే.

పరా—ప్రేయసీ, ప్రపంచమున రాజై పుట్టవలెనంటే వాసవగత్తునివలె పుట్టవలెను. అతనికి కొదవయన్నది లేదు.

"అతిఘనతలందు మే మరయుజాలము జ్ఞాన
యుత సంతతియె కాక వేరు."

అన్నట్లుశాస్త్రజ్ఞానము, కళాజ్ఞానమూ, రూపలావణ్యా ములూ కలిగి మాణిక్యములవంటి కొడుకునూ కూతురినీ కాంచినాడు. ఇంకేమికావలె ? నా కత్యంత మిత్రుడైనా అతని తలచినప్పుడెల్లా నాకీర్ష్య పుట్టుతూ ఉండును. నాకెంత

పరువియున్న నేమి? ఎంతభాగ్యమున్న నేమి? పుత్రుడు లేడు కదా? ఇంతకన్న నెక్కువ విచారహేతువుండునా?...కాని లభించని వస్తువులను గురించి వ్యసనపడిన నేమిలాభము!

పద్మా—(సులోచన చెవిలో) కొడుకుమాట నేను చెప్పలేను కాని త్వరలో మనుమడు కలుగవచ్చును.

పరా— పరమేశ్వరుడు మనపై కరుణించి ఇద్దరు కుమార్తెలను ప్రసాదించినాడు- అదెంతకాదు? ఆభాగ్యమును చూచుకునే మనము సంతసించవలెను.......లీలావతీ, నీవే పుత్రుడవైనట్లయితే నే నెంతటి అదృష్టవంతుడ నౌదును? నీ బుద్ధికీ ధైర్యమునకూ నీవు మగవాడివి కావలసినదే. ఇంక పుత్రవంతుడ నౌదునను ఆశ విడిచినాను. కోరనోములు నోచిన వాళ్ళకి గొప్పఫల మబ్బునా?

కాంతి— నాథా, సత్యము- ఎన్ని సంపదలున్నా సుతుడు లేకున్న అవి నిష్ఫలములే.

సులో—నాన్నగారూ, పద్మాక్షి రేపే పయనమంటు న్నది, పాంచాల మహారాజుగారికి ఐదారు దినము లుండి కొని ఆమెను పంపుతామని ఉత్తరము వ్రాయండి.

పరా—పద్మాక్షీ, ఇంతలో నేమి తొందర? కొంచెము తాళి పోవచ్చునులే.

పద్మా—ఇంతలో మించిపోయేది లేదు, కాని నా వెంట సులోచనను పంపుతామంటే రెండు మూడు రోజులాగుతాను.

శాంతిసుణి—ఏమమ్మా, పద్మాక్షీ- రెండుమూడు నాళ్ళుండి పోకూడదగా ? ఇంతలోనే తొందరా ? నేడేకదా వచ్చినావు !

పద్మా—మావాళ్ళు నన్ను శీఘ్రముమే రమ్మన్నారు.

(పరాక్రమకేతు వచ్చును.)

పరా—ఓహో ! పద్మాక్షీ ! నిన్నుచూచి చాలా కాల మయింది- ఇన్నాళ్ళకు మామీద దయపుట్టిందా ?

పద్మా— మిమ్ముచూచి చాలానాళ్లవుట చేతనే ఒక్కసారిచూచి పోదామని వస్తిని.

పరా—మీతల్లిదండ్రులకు బంధువులకూ క్షేమమా?

పద్మా—మీ కృపవల్ల అందరికీ క్షేమమే మావాళ్ళందరూ మిమ్మందరినీ చాలా అడిగినామని చెప్పుమన్నారు.

పరా—మీతమ్ముడు సుఖియై ఉన్నాడా ?

పద్మా—మీ కటాక్షమువల్ల ఆతడు సుఖియే.

పరా—ప్రేయసీ, ప్రపంచమున రాజై పుట్టవలెనంటే వాసవదత్తునివలె పుట్టవలెను. అతనికి కొదవయన్నది లేదు.

"అతిఘనతలందు మే మరయజాలము జ్ఞాన
యుత సంతతియె కాక వేరు."

అన్నట్లుశాస్త్రజ్ఞానము, కళాజ్ఞానమూ, రూపలావణ్యాములూ కలిగి మాణిక్యములవంటి కొడుకునూ కూతురినీ కాంచినాడు. ఇంకేమికావలె? నా కత్యంత మిత్రుడైనా అతని తలచినప్పుడెల్లా నాకీర్ష్య పుట్టుతూ ఉండును. నాకెంత

పదవియున్న నేమి ? ఎంతభాగ్యమున్న నేమి? పుత్రుడు లేను కదా ? ఇంతకన్న నెక్కువ విచారహేతువుండునా ?... కాని లభించని వస్తువులను గురించి వ్యసనపడిన నేమిలాభము ?

పద్మా—(సులోచన చెవిలో) కొడుకుమాట నేను చెప్పలేను కాని త్వరలో మనుమడు కలుగవచ్చును.

పరా— పరమేశ్వరుడు మనపై కరుణించి ఇద్దరు సుమూర్తులను ప్రసాదించినాడు- అదెంతకాదు? ఆభాగ్యమును చూచుకొనే మనము సంతసించవలెను.......లీలావతీ, నీవే పుత్రుడవైనట్లయితే నే నెంతటి అదృష్టవంతుడ నౌదును ? నీ బుద్ధికీ ధైర్యమునకూ నీవు మగవాడివి కావలసినదే. ఇంక పుత్రవంతుడ నౌదునను ఆశ విడిచినాను. కొరనోములు నోచిన వాళ్ళకి గొప్పఫల మబ్బునా ?

కాంతి— నాథా, సత్యము- ఎన్ని సంపదలున్నా సుతుడు లేకున్న అవి నిష్ఫలములే.

సులో—నాన్నగారూ, పద్మాక్షి రేపే పయనమంటున్నది, పాంచాల మహారాజుగారికి ఐదారు దినము లుంచుకొని ఆమెను పంపుతామని ఉత్తరము వ్రాయండి.

పరా—పద్మాక్షీ, ఇంతలో నేమి తొందర? కొంచెము తాళి పోవచ్చునులే.

పద్మా—ఇంతలో మించిపోయేది లేదు, కాని నా వెంట సులోచనను పంపుతామంటే రెండు మూడు రోజు లాగుతాను.

(చెలికత్తె వచ్చును)

చెలి — మహాప్రభూ, పాంచాల మహారాజుగారిపద్ద నుండి రాయబారి వచ్చినాడు.

పరా — సరే. నేనుపోయి వాని వృత్తాంత మరసె దను. మీరిక్కడనే ఉండండి. (పోవును)

కాంతి — పద్మాక్షీ, ఆ సమాచార మేమైయుండును?

పద్మా — ఏదో శుభవార్త అవునని తోస్తుంది.

లీలా — పద్మాక్షీ, నీ తమ్మునికెంత మంది పిల్లలు?

పద్మా — హాస్యమాడుచున్నావా? ఆతని కింకా పెళ్లే కాలేదు.

కాంతి — పద్మాక్షీ, మరి నీవివాహ మెప్పుడు?

పద్మా — యోగ్యుడగు వరుడు లభించగానే.

కాంతి — నీకుతగ్గ పురుషు డెట్టివాడు?

సులో — ఆఁ, దొరికినావు పద్మాక్షీ, నీవరు డెట్టి వాడో చెప్పు చూతాము.

పద్మా — మీకు తగినవా రెట్టివారో చెప్పితే నేనూ చెప్పుతాను.

కాంతి — అదికాదు. నేను చెప్పేది వినండి. నేను మిమ్మొక్కొక్కరినీ అడుగుతూ వచ్చేదను- మీ మనసులోమాట దాచక చెప్పండి. నీ వేమంటావు పద్మాక్షీ?

పద్మా — ముందు లీలావతి చెప్పనీయండి.

లీలా — అదేమి? మీరే చెప్పకూడదా?

సులో—నీవు పెద్దదానవు గనుక ముందు నీవు చెప్పు, తరువాత మేము.

కాంతి—నిజమే. లీలావతీ, నీవే ముందు చెప్పు.

లీలా—చెప్పనా? నా పెనిమిటి చక్రవర్తి పెద్దకుమారుడై, మంచి అందగాడున్నూ, సకలైశ్వర్య సంపన్నుడై యుండవలెను. గుణ మేలాగున్నా ఫర్వాలేదు, దానిని దిద్ది తోవలోనికి నేను తేగలను.

కాంతి—నీగుణము చూపించుకున్నావే లీలావతీ!

లీలా—మీవలెనే నేను ఏమరుదు ననుకొంటివా?

కాంతి—సులోచనా, నీ కెట్టివాడు కావలెనో చెప్పు.

సులో—నాకు పెళ్లివద్దు.

పద్మా—ఏదీ, సులోచనా, నా మొగము చూచి నిజము చెప్పు, అబద్ధమాడకు.

సులో—అమ్మా, నాపెనిమిటి సద్గుణవంతుడు సుజ్ఞానియున్నై, అందముకలిగి ఎప్పుడూ నన్ను విడువక నాపై ప్రేమచేత వేరెవ్వతెనైన కన్నెత్తి చూడకుండవలెను. ఇది నా అభీష్టము.

పద్మా— బలే. మంచికోరికే. భగవంతుడు నీకట్టివరునే ప్రసాదించుగాక! (సులోచనను కౌగిలించును)

కాంతి—నాకోర్కె కూడా అదే.

లీలా—ఆలాగుననా? అట్టి మగని చెట్టబట్టవలెనంటే ఈలోకమును విడిచి ఇంకొక లోకమున వెదకవలెను.

కాంతి—పద్మాక్షీ, నీమాట చెప్పినావు కావు.

(పరాక్రమ కేతు వచ్చును)

పరా—దేవీ, నేనొక శుభవార్తను తెచ్చినాను. చెప్పకోగలవా ?

కాంతి—నాకోమీ తోచలేదు. అదేదో శీఘ్రముగా చెప్పండి.

పరా—మనకు పుత్రుడు లేడని ఇప్పుడే చింతించినాము కదా, దానికి బదులు త్వరలో మనుమడు కలిగే అనువు పరమేశ్వరుడు ప్రసాదించినట్లుంది. (శుభ లేఖ నిచ్చును)

కాంతి—పాంచాల దేశమునుండి వచ్చినట్లుంది ఈశుభ లేఖ.

పరా—ఔను. మన సులోచనకు తన కొడుకు శ్రీదత్తుని కిమ్మని వాసవదత్తు డీశుభలేఖ రాయబారిచేత పంపినాడు. నీ వేమందువు ?

కాంతి—అనడాని కేముంది? మంచి సంబంధమేదైనా కలిసి వచ్చునా అని ఉవ్విళ్ళూరుచుండ, పండు తెగి పాలలో పడ్డట్లయింది. కాని పెద్దపిల్లకు మాని చిన్నదానికి ముందుగా పెళ్ళిచేయడ మేలాగు ?

పరా—ఇందు ప్రమాదము లేదు. గాంధర్వవివాహము సదాచారమగు మనజాతి కిది ఆచార విరుద్ధము కాదు. దానికి కళ్యాణకాలము సమీపించినట్లుంది. (రహస్యముగా) ఆ రాయబారితో మాకు లీలావతి అనే పెద్దపిల్ల

ఉన్నది, దానిని మీనాయుస రాజుగారికి చేసుకో సూడదా అని చెప్పిచూచినాను ; అతడు డందుకొప్పుకొనక సులోచననే కావలెనని పట్టుపట్టినాడు. మనమేమి చేయగలము? పోనీ, ఈ సంబంధమే వదలుకొందామంటే, వాసవదత్తుడు చిన్నబుచ్చుకొని, ఆక్రోపముచేత పగబూని మనపై దండెత్తివచ్చినా, అకుంఠిత వీరుడా శ్రీదత్తు డొకడే చాలు మనసేనమట్టిలో కలుపడానికి. అదీకాక, ఈసంబంధము పోగొట్టుకో తగినది కాదు. శ్రీదత్తునకు పిల్లనివ్వడమునకు సకల దేశాధినాథులూ కాచుకొని ఉన్నారు. వారే కోరి అడుగుట మనభాగ్యము. శ్రేయోదాయకమైన సంబంధమును చెడగొట్టుకో రాదు.

కాంతి—సరే—వేరాలోచన లెందుకు ?

పరా—అమ్మా సులోచనా, ఏమి తలవంచుకొని నిలుచున్నావు? నీకిది సమ్మతమేనా ?... ఏమి ఊరకున్నావు ? భీతివద్దు, మనసులో మాట చెప్పు.

లీలా—దానిని మీరడుగ నక్కరలేదు. పద్మాక్షి ప్రొద్దుటి నుంచీ చెవి నిల్లు కట్టుకొని పోరింది. అది పోసిన మందు సులోచన నెత్తి కెక్కియుండును.

సులో—నాన్నగారూ! మీమాట కెదురు చెప్పక మీ చిత్తమునకు నచ్చినట్లే వర్తింతును.

కాంతి—అమ్మా, నీవు శ్రీదత్తుని పెళ్ళియాడి, వియోగమన్న దెరుగక సుఖముగా చిరజీవిని వగుదువుగాక !

పరా—దీనిలో నింకొక చిన్నచిక్కుంది. వివాహము

తన పట్టణమున జరుపవలెనని వ్రాసవరత్తుడు (వ్రాసినాడు—దీని కేమందాము ?

కాంతి—బాగు బాగు, ఆడదాని పెళ్ళి అత్తింటనా! అది మన యింటనే జరుగవలసిన వేడుక.

పరా—నే నెంత చెప్పినా రాయబారి పట్టువిడువకున్నాడు.

కాంతి—ఏదీ, ఇద్దరమూ చెప్పి చూతాము. అంజనా, ఆ రాయబారి నిచ్చటికిరమ్మను. (ఆమె పోవును) పిల్లలారా, మీరందరూ తోటకు పోయి బంతి ఆడుకోండి. నే నిప్పుడే వస్తాను. (వారు పోవుదురు)

పరా—ఇదంతా పద్మాక్షి పనే అనుకుంటాను.

(లీలావతి తిరిగివచ్చి తెరచాటున నిల్చుండ దాసియు కరుణాకరుడూవత్తురు)

కరుణాకరా, ఈవివాహము మాకందరికీ సమ్మతమే, కాని ఈశుభకార్య మక్కడ జరిపించుటకు మాత్రము దేవిగారు ఒప్పుకొనలేదు.

కరు—మహారాజా! దీని కెవ్వరూ ఒప్పుకొనక పోవడము సహజమే. కాని అందుకు తగిన కారణము మొదటనే మీతో మనవి చేసుకొన్నాను. మాయువరాజుగారి చిత్తమెందుకో కొంచెము వ్యాకులత చెందియున్నది. దానిని పోగొట్టడముకే మామహారాజుగారు సాధ్యమయినంత వేగిరము తగిన పిల్లను చూచి వివాహము సలుప నిశ్చయించి

నారు. అదీ కాక ఇక్కడికి వచ్చుటకు యువరాజు ఇష్టపడక పో వచ్చును. అయ్యా! వివాహ మిచ్చట జరిగిన నేమి? ఇదీ అదీ మీ దేశములే, తేడా లేదు. స్వయంవర వివాహము పెళ్ళి కొడుకింట జరుపుట క్షత్రియాచారమే కదా? ఇది క్రొత్త కాదు. మహారాజుగారికి మిచ్చట తీర్పుడని మిమ్ము వదే పదే వేడు మన్నారు.

వరా—దేవీ, వారంత నొక్కి చెప్పు చున్నాడు మనము కాదనగూడదు. ఆతని యిష్టమెట్లో అట్లే జరుపు దమా?

కాంతి—ఎంతైనా మగపెళ్ళివారి మాట మీదు— అట్లే కానివ్వండి.

వరా—అయ్యా, కమలాకరా, ఇచటి వృత్తాంతము వారి కెరిగిస్తూ మీరు త్వరము వ్రాయండి, నేనూ వ్రాస్తాను. త్వరలో ముహూర్తము నిర్ణయించి మేము బయలుదేరి వస్తూన్నాము.

కరు—మహాప్రసాదము. (పోవును)

వరా—నేను వివాహమునకు కావలసిన సన్నాహము చేయవలెను. తనకు మొదట వివాహము కాలేదని లీలావతి వ్యసనపడునేమో? అది అట్టిదికాదు; ఐనా దానిని కొంచెము సమాధానపరుచుము. అచిరకాలముననే మంచి సం బంధము వెతికి దానికి కూడా పెళ్ళిచేయవలెను. ప్రకృతమున

ఈకార్య మేలోపమూ రాకుండా నెరవేర్చవలెను. పోదాము, రా. (పోవుదురు)

(లీలావతి వచ్చును)

లీలా—ఆలాగా! నాకంఠములో జీవముండగా ఇది నిర్విఘ్నముగా నెరవేరునా? బ్రహ్మకు బుద్ధిపోయి నట్లుంది, లేకుంటే వస్తువుయొక్క మంచిచెడ్డల నెరిగి దాని ననుభవించు శక్తియున్న వానికి దాని నొసంగక, దాని మహిమ నరయ లేని మూఢున కెందుకు సమకూర్చును? సులోచనకు లోక జ్ఞానము పూజ్యము, లోక మోహనుడగు శ్రీదత్తునకు రాణియై సామ్రాజ్యమున కంతటికీ చక్రవర్తినియై, సార్వభౌమునకు పట్టమహిషియై సర్వసుఖములననుభవింపదగినదా అది?...శ్రీద త్తుని చిత్తము వ్యాకులితమైయున్నదట. ఈసులోచన దానిని చక్క చేయగలదా? ఛీ, ఛీ—సులోచనా, ఈమహాయోగము నొందగలదానవు నీవా? పసికూనవు—నీకట్టి సౌభాగ్యము పట్టడము కోతికి జలతారు కుళ్ళాయి దొరికినట్లు కాదా? శ్రీదత్తుని పెళ్ళాడి పాంచాలమునకు రాణివౌదునన్న ఔత్సు క్యమువదలుకో. ఈమర్యాద భరమున నిట్లంటి నసుకోనకుమా! అమాయికురాలవగు నీమీద నా పగబూనుట!..కాదు కాదు—ఈసుఖము లెల్ల అనుభవించ తగిన దానను నేను. నీకట్టి దశ చేకూరెనా లోకము నవ్వ తగినదే. పాత్రత నెరిగి సౌభాగ్యము చేకూర్చవలెనని ఎరిగియుండీ, ఇట్టి ఉన్నత స్థితిని పొందతగని నీకేల బ్రహ్మ దానిని దాపురించెనో విం

తగానున్నది...ఇదిలాగుండనీ, దానవదత్త మహారాజు వ్రాసిన శుభలేఖలో మాయిద్దరిలో నొకరిని యిమ్మని అడిగినట్లుంటే ఈరాయబారి సులోచన నిమ్మని పట్టుపట్టి నాడేమి? అది నాకన్న అందకత్తె గనుకనా, లేక బుద్ధిశాలిని కావడముచేతనా?...ఆఁ, ఇప్పు డీకుట్ర క్రమ క్రమముగా బయలు పడుతూంది. ఇదంతా పద్మాక్షిపనీ అని నాకన్న గారన లేదా?...ఔను. సందేహము లేదు. పద్మాక్షి వచ్చినది మొదలు సులోచన నొక క్షణమైనా విడిచి యుండలేదు. లోలోన కార్యమంతా కడతేర్చి ఇప్పుడేమీ ఎరుగని పిల్లివలెనుంది...అమ్మా! పద్మాక్షీ నీవెంత జగ జంతివే. ఇంతకుత్సితురాలవని మొదట తెలిస్తే నీపని పట్టి యుందును...కానీకానీ! లోకమును మూసితివి కాని నా కన్ను గప్ప నీతరమా! సముద్రతరంగములనైనా ఆపగల్గుదు వేమో కాని నాకార్యకలాపము నాప నీవశమా?...ఇదంతా నీ కుతంత్రమే కదా! ఇదంతా భగ్నముచేసి, నేనే శ్రీదత్తు నకు పట్టపురాణినై మీబలగమంతటిని రూపుమాపకున్న నాపేరు లీలావతి కాదు. నీగర్వము నణచుటకే నేనీ కల్పనను తారుమారుచేయ నెంచినాను కాని సులోచనయెడ నసహ నముచేత కాదు. నేను చేయబూనిన కార్యమును చెరుప నెవ్వరి తరము?...నే నాలసించరాదు. అచిరకాలమున నా ప్రతిన నెరవేర్చుకొనకుంటే అంతా చెడిపోవును...సరే. ఇప్పుడు చేయవలసిన దేమి? ఈసులోచనను శ్రీదత్తుడు చేకొన

కాండునట్లు చేయడము, మొదటిది...ఇదెంతసేపు? ఈపట్టణముసుంచి,...ఏమిా,...ఈలోకమునుంచే...దీనిని పంపివేయవలెను. దానికి నచ్చిన మగడు దానికీ లోకమున చిక్కడు. ఇంకో లోకమునకు పంపించితినా, ఆమె కచట వివాహము శీఘ్రముగానే కాగలదు....కాని...పాపము...అది నాకే కీడూ చేయ లేదు...కనుక దానిని చంపక ఎక్కడైనా దాచిపెట్టితే...ఛీ, ఛీ, సగము సగముగా పనిచేయడము వల్ల లాభము లేదు.

కాయ కష్టంబు చూడ రాకలిని గనరు
కన్నువాల్చరు సేగియు గైకొనెదరు
మెప్పు కోరరు దూషణ చొప్పు వినరు
కర్మమే కన్నుగా గల ఘనులు తలవ.

చేసేది మూలముట్టుగా చేయవలెను, లేదా కార్యములో తల దూర్చనేరాదు. కరవులో దాసరివేషము వేసి పదాలు పాడకుంటే తీరుతుందా?...అదీకాక నేను సార్వభౌముని రాణినై అన్ని ముచ్చటలూ వీగవలెనంటే నాతోవ కడ్డముగా నిది వచ్చి నాకు మహాపకారము చేయులేదా?... నేను సంకోచింప నక్కరలేదు... వే రాలోచన అవసరము లేదు. సులోచన చావవలసినదే...రెండు మూడు రోజులలో వీరంతా పయనించవలె నట...కానీ...వీరియాటలు సాగనిత్తునా?

అయ్యో! పాపము సులోచనకు కాలమింతతోనే

మూడవలయును కదా!... నేనెంత క్రూరురాలనైనా నా చెల్లెలను నా చేతులతో చంపడానికి మనసొప్పకుండా ఉంది. నామెడ దానికెంత విశ్వాసము! ఎంత నమ్మకము! ఈ సంకటమునుండి నేను తొలగి అపవాద నామీద పడకుండా కార్యము కొనసాగించవలెను ..ఇదే మంచి మార్గము.

(దాసి వచ్చును)

దాసి—అమ్మా! మిమ్ము దేవిగారు పిలుచుకొని రమ్మన్నారు, ఉద్యానములో నున్నారు.

లీలా—సరే. ఇప్పుడే వస్తానని చెప్పు. తోవలో దంతవక్త్రుని నేను రమ్మన్నానని చెప్పు. (దాసి పోవును)

(దంతవక్త్రుడు వచ్చును)

దంతవక్త్రా! దుర్మతి ఏడీ?

దంత—ఇంటివద్ద నున్నాడు. నేటి చౌకీవంతు నాది.

లీలా—ఒకమాట. రేపు సాయంత్రము మీకిద్దరికీ చెరియొక వెయ్యివరహాలు పుచ్చుకొనవడ మిష్టమా, లేక చావడ మిష్టమా?

దంత—అమ్మా!

లీలా—అరవకు. నేను చెప్పినట్టు మీరిద్దరూ చేస్తారా, లేక కాలనేమిని మీరు ఖండించిన సంగతి రాజుగారితో చెప్పనా?

దంత—(లీలావతి కాళ్ళమీద పడి) అమ్మా, మా ప్రాణాలు మీ చేతిలో నున్నవి. ఇంతకాలము మమ్ము కాపాడిన మీరు ఇప్పుడు కాపాడరా? మామీద దయ తప్పకండి.

మీ కేమి చేయండంటే దానిని చేయుడానికి మీ సేవకులు సిద్ధముగా నున్నారని నమ్మండి-

లీలా—మంచిది- నేను చెప్పేది సావధానముగావినుు. అర్ధము చెప్పితివా ప్రాణాలుండవు జాగ్రత్త! ఇదిగో వినుు- నేటిరాత్రి రెండుజాములకు మీరిద్దరూ సులోచన పడకగది దగ్గర వేచియుండండి. అప్పుడు మూడు చిటికలు వినబడ గానే మెల్లగా లోపలికి దూరి మంచముపై పరుండిన సులోచ నను నిశ్శబ్దముగా నిశ్చలముగా బైటకు కొనిపోవలెను- తలుపు లన్నీ తెరచియుంచుదును. రెండుగంటలదాకా ఆమెకు మైకము విడువదు, ఆలోగా సమీపమునయున్న కారడవిలో ఆమెను చంపి పాతిపెట్టి రేపుదయము దృష్టాంత మేదైనా నాకు చూపితే మీకిద్దరికీ చెరిఒక వేయివరహా లీనాము ఇస్తాను- ఇందేదైనా పొరబాటు వస్తే మిమ్ము చంపించి తీరెదను... మీకెట్టి భయమూ వద్దు- తగిన బందోబస్తు చేసుంచుతాను. చలికత్తె లొక పిట్టయినా ఉండనీయను. ఈ మహాలు పడ మటి ద్వారమున నొక పురుగునైనా ఉంచను. ఈసంగతి మీయిద్దరికీ తప్ప ఆరవచెవిని వేస్తిరా మీకు చావు తప్పదు- మీ ప్రాణాలమీద పిల్లలమీద ఆశ ఉన్నదా నేను చెప్పిన ట్లిల్లు చేయండి. మీకు బుద్ధిఉంటే మొహిరీలు దొరుకుతవి, లేదా మృతి తప్పదు. నీవుపోయి దుర్మతితో చెప్పు- (వాడు పోవును) రేపీపాటికి సులోచనో లేక నేనో చక్రవర్తిని కాన దము తేలిపోతుంది......

## రెండవ రంగము

---

పరాక్రమకేతు అంతఃపురమున సులోచన మంచము మీఁద తలిదండ్రులతో కూర్చొన్నది, లీలావతి దూరమున నుంది.

పరా—సులోచనా, నేను చెప్పునది మదిలో నుంచుకో, పెళ్ళియైనపిమ్మట వాసవదత్తుడు నీతండ్రియనీ చిత్రరేఖా దేవి తల్లియనీ భావించి మావద్ద నడుచుకొన్నట్లే వాళ్ళ యొద్దకూడా భయభక్తులతో వర్తించుము. పెనిమిటే దైవముగా నెంచి ఆతనిమాట జవదాటక, అతని యోగక్షేమముల నారసి, అతని మదికి నచ్చేటట్లు నడుస్తూ, గాఢప్రేమ భాజనవు కమ్ము. నీవు చేసేదెల్లా పుట్టినింటికీ మెట్టినింటికీ ఖ్యాతి తెచ్చేటట్లు చేస్తూ యుండుము. నీవెంత ఉన్నతస్థితి యందున్నా నీ చుట్టాలను, మిత్రులనూ మరువక ప్రజల కందరికీ తల్లివలె నుండి బీదసాదల నొకకంట కనిపెట్టుచుండుము- సతీధర్మమును పాలిస్తూ సజ్జనులసాంగత్యమున కాలముగడుపుతూఉండుము. స్త్రీయైపుట్టిన నిట్టిసుగుణము లలవడవలెను. అంతట నామెను కన్నవారూ, ఆమెను భార్యగా గొన్నవాడునూ ధన్యు లనిపించుకొందురు. ఇంతకన్న వేరేమి చెప్పగలము ?

కాంతి—కన్నా, చెప్పవలసినదంతా మీ నాన్నగారు చెప్పినారు. అమ్మకి రెండబ్బకి రెండు తిట్టించక నద్వినీత వని

పించుకొనేలాగు నడుచుకో. పెనిమిటి కోపము చెందినా నీ వాతనియెడ విముఖివి గాకుము. సవతున్నా తెందరున్నా భర్తకుమనను నొచ్చేలాగు నడువకు.

"తనుగాచి తనుగొన్నతని చూచినొరలెంచు
ఘనత పోషించునది కాంత."

సులో—అమ్మా, మీరు చెప్పినదెల్ల మది నుంచుకొని అట్లే వ్యవహరించుచుందును, నావిషయమున మీరు కలతపడకండి.

కాంతి—చిట్టీ- ఇంకొక విషయము. చిత్రరేఖాదేవి శ్రీదత్తునికి సవతితల్లి- అందుచేత నామె నీయెడ కఠినత చూపెనా సహించుకొనియుండు ; ఆమాట నీపతి చెవిని వేయక, నీకు దుస్సహమయినప్పుడు పద్మాక్షి సలహాచొప్పున నడుచుకో ; ఆమెయే అచ్చట నీకాడదిక్కు.

పరా—కాంతిమతీ- కూతురుయందలి కడుపు తీపిచే అట్లంటున్నావు కాని అత్తగార్లు, మారటవు తల్లులందరూ చెడ్డవాళ్లే అని తీర్మానించవచ్చునా ? అమ్మా, సులోచనా, నీయెడ వారెల్ల దయాశీలురై ఉందురు, భయపడకు.

కాంతి—లీలావతీ, సులోచనకు బోధించినదంతా నీకూ బోధించినట్లే అనుకో.

లీలా—ఆలాగే.

పరా—ఇక మనము పోదాము.

కాంతి—కన్నా, సుగుణవంతుడగు శ్రీదత్తునకు తగిన

ధర్మపత్ని వగుదువుగాక! (వరా॥ కాంతి॥ యూ పోవుదురు.)

లీలా—చెల్లీ! నేనుకూడా పోయెదను- శ్రీదత్తునివివాహము చేసుకొని నిరతిశయానందమును పొందుము. (ఆమె ముద్దుపెట్టుకొనునప్పుడు పాలలో మందు కలుపును.) అప్పుడు మమ్ము మరువకుమా!

సులో—బాగు బాగు—నన్ను నేను మరచినట్లైతే మిమ్ము మరచెద ననుకో. (లీలావతి పోవును)...నాకడుపులో చేయిపెట్టి కలిపినట్లున్నది. ఏదో ఆందోళనముగా నుండి గుండెలో మంటపుట్టుతూన్నది. కారణము కాన్పించదు. మనసులో నేదో ఆపద సంభవించునట్లు స్ఫురిస్తూన్నది— ఏమి కీడు మూడునో, కాగల కార్యములు తమ నీడల ముందుకు చాచునందురు...పరమేశ్వరా! దీనదయాళూ! నీవే దిక్కు. మాకే యాపదా తటస్థించకుండా రక్షించు భారము నీది. ఈపాలు తాగి పరుండిన, కలత తగ్గునేమో!(పాలుతాగి

ఏమి సేయును నన్ దినమేమి సేయు
విధియు నాకొరకెల్లెడ వెదకుకొంచు
నేగుదెంచెడి జముఁడు నన్నేమి సేయు!
గ్రహము లెది చేయుగలవు యుగ్రతరమూర్తి
పదియు రెండుకరంబుల బరగువాడు
షణ్ముఖుడు సుబ్రహ్మణ్యస్వామి యిదిగో
నాకనులముందు నిలిచియున్నాడు సతము.
జగదీశ్వరా, నన్ను కాపాడుము...నిద్ర రాకున్నది...

ఆందోళన మతిశయిస్తూన్నదే కాని తగ్గుటలేదు. కడుపులో మంట హెచ్చుతూన్నట్లుంది. తల తిరుగుతూన్నది...నోట తడి యూరి నాలుక పిడచగట్టుతూంది. అమ్మను పిలువనా? అర్ధరాత్రి కావచ్చింది ..—వారందరూ బెంగపెట్టుకొందురు. కన్నులు మూతపడుతూన్నవి—చిన్న నిద్ర తీస్తే అంతా సర్దుకో వచ్చును—(పండుకొనును)

(దంతవక్రుడు దుర్మతియు సులోచన నెత్తుకొని పోవుదురు)

లీలా.—ఇంతవరకూ నా కార్యము సానుకూలముగా సాగింది. ఇక భయములేదు. వీరి నడ్డువారుండరు...అయ్యో! సులోచనా! నిన్నిదే కడసారి కాంచడము కదా! నీ నుదుటి వ్రాత యిట్లున్నది—ఇక నేను పోయెదను.






# రెండో అంకము

---

## మొదటి రంగము.

కారడవిలో ప్రతాపశీలుడు.

ప్రతా—అలవాటుచొప్పున యోగాభ్యాసముకొరకు ఈ యడవికి వచ్చినట్లుంది యువరాజు. మంచి సమయమే చిక్కింది. ఇక్కడ నే నితని చంపితినా నన్ను పట్టుకొను వా రెవరు? ఇతడు చనిపోయినట్లే ఎవరికీ తెలియదు. అతడెన్నో అడవులు తిరుగాడువాడు, ఇచ్చట నుండునని కూడా ఎవరికీ తెలియదు...అయినా భయము పోలేదు... ఈ సంగతి బయల్పడితే నాగతి ఏమి కానున్నది? ఎట్టి విషమసంకటము ప్రాప్తించినది! ఈపెళ్ళి దాపురించకుంటే నాకింత తొందర ఉండకపోవును. ఇది రావడమువల్ల నా యేర్పాటులన్నీ తబ్బిబ్బైనవి... అయినా సర్వమూ సిద్ధపర్చుకొన్నపిదప నిక చర్చ యెందుకు?

"ఎంచి బాగుగ నిశ్చయించు కార్యము పిదప
నెంచి తర్కించు టది తప్పు."

యువరాజేడీ? ఇటేకదా వచ్చినాడు- ఎక్కడా కానమే! ఆఁ. అదిగో వస్తూన్నాడు- నే నీ చాటుననే దాగుకొని యుండి గురిచూచి బాణము వదిలెదను. అది తగిలినా మానినా నేను ఈతనికంట పడరాదు. అట్లే జరిగినట్లయితే ప్రాణాలమీద ఆశ వదలుకోవలసినదే. యోగాభ్యాసమువల్ల దేహము కొంచెము చిక్కిందే కాని ఈతని బలము ఎక్కువైనట్లుంది. యోగివలె నుండవలెనని ఉంచగాని, ఇతనికి కొన్ని వేళలందు కోపము హెచ్చు. ఇదే దాపవుతూన్నాడు- నేను సిద్ధముగా నుందును. అంబా! మహిషాసురమర్దనీ! దుర్గా! నేడు నీవు నాపై కృప జూపితివేని రాజ్యాధిపతుడనైనపిమ్మట నిన్ను కులదేవతవలె కొల్చుకొందును....

---

## రెండో రంగము

---

### అడవిపొదలో సులోచన

సులో—(లేచి) ఏమిది? నే నెక్కడనున్నాను? కల కంటున్నానా? అక్కా! లీలావతీ!... నేను మేలుకొనియున్నానే! ఈయడవిలోని కెట్లువచ్చినాను? ఇక్కడ క్రూర మృగములుండు నే. నామంచముతోగూడ నన్నిక్కడికి కెవరు తీసుకొనివచ్చినారు?...మాఊరెట్లు చేరగలను? అయ్యో! మాఅమ్మా మానాన్నగారూ నన్నెంత వెదకుకొందురో

గదా!...భరింపలేని దాహము వేస్తున్నది....ఇదేమి టీ కాగి తము? ఇందేదో వ్రాసినట్లున్నది...(చదువును) "మీరు ఫలానా అని ఎవరికి తెలిసినా, లేక మీరు హాస్తినాపురము తిరిగీ వచ్చినా తక్షణమే మీకు మృతితప్పదు."...ఏమిదీ? ఎవరు వ్రాసినారిది? నేను చచ్చునంత నేర మేమిచేసినాను? సరే-ఇంకా చదివి చూస్తాను. "అందుచేత—తర్వాత ఏమీలేదు. ఇన్నిక్కడకి తెచ్చినవాళ్ళే ఇది వ్రాసియుండ వలెను...నాగుండెలో రాయిపడ్డది. ఏలాగైన ఇల్లు చేరుకో వచ్చునని సమాధానపరుచుకొన వీలులేదే? నాపేరే చెప్ప రాదని నిర్బంధించినారు. దీనికి కారణమేమైయుండునోకదా? బయలుపడితే చావుసిద్ధమట-నే నేమిచేతును? నాకెవరు దిక్కు! ఎందుపోవుదును?...ఆ. ఎవరో వస్తూన్నట్లుంది.

(సారంగుడు వచ్చును)

సారం—ఏమి నా రాత! ఈయడివిలో చిక్కొడ్డాను. సీకటిపడేలోగా ఇల్లు సేరకుంటేసీపులుగుకట్టయిరిగిందన్నమాటే. నేడేజంతువు చిక్కలేదు ..(సులోచనను చూచి) ఇదెవరూ... ఆడదాన్లాగుంది! ఒక్కత్తే ఉంది- సుట్టుపక్క ఎవరూ లేరు- శిత్రం-అబ్బా! ఎంతసక్కని మనిసి- పలకరించి సూస్తా. ఎవరు నువ్వు? ఒక్కత్తెవున్నావే? నిజం శెప్పు.

సులో—నేను ఎవతెనో చెప్పరాదు-గొప్పయింటి దానను-నానాలుక యెగిరిపోతూన్నది. కొంచెము నీరు కా వలెను. దగ్గరనున్న చూపి ధర్మము కట్టుకొమ్ము.

సారం—నరేనానికేంగాని సీనవాచారం శెప్పు. ఒక్కత్తె విక్కడి కెందుకొచ్చావు, మీ వోళ్ళెవరూ యెంట నాలేదా ?

సులో—అయ్యా, నే నిక్కడి కేలాగునవచ్చితినో ఎరుగను.

సార—అన్నీ బాగావున్నాయి కాని ఒక్క చిక్కొచ్చింది. మాయింటికి రాన్నేవేం శేయుడం? ఆ, సూర్దాంతరువోత సిపేరేవేం?

సులో—దుష్టా! మర్యాద నెరుగవా ? తల్లివంటి దాననునన్ను ఏమే అంటావేమి ?

సార—అబ్బా ! ఎంతరోసం వొచ్చింది. కోప్పడకూ, నేను శెప్పేదిసుకో. నాయెంటా నూ రా, నీకూ్క డెంద తాను, గుడ్డాడ తాను-సక్కగా బతుకుదూగాని.

సులో—ఛీ-పశువా ! నాదగ్గర రాకు.

సార—అబ్బో ! ఏటన్నావు?(చేయిపట్టుకొనబోవును)

సులో—అయ్యో ! అయ్యో ! నాకెవరు దిక్కు!

(శ్రీదత్తుడు వచ్చును)

శ్రీద—ప్రజ్ఞానం బ్రహ్మ, విజ్ఞానం బ్రహ్మ-

సులో—స్వామీ ! యోగీశ్వరా ! నాపాలిటి దైవమువలె నవతరించినారు. ఈదుష్టుడు నన్ను బాధిస్తూన్నాడు రక్షించండి-మహాత్మా !

సారం—ఒరేయ్-నీకేంపని? నీదారి నీవు పోశ్శి.

శ్రీద——నాకేల యీగోల? ..(పోబోవును)

సులో——స్వామీ-ఈపాపాత్మునిపాల నన్ను పడవేసి పోవుట, మీకుధర్మమా-దీనను రక్షించి పుణ్యముకట్టుకొనరా!

సారం——(ఆమె చేయి పట్టుకొనబోవును.)

సులో——ఛీ, దురాత్మా, నన్నంటరాకు, దూరమున నుండుము. మహాత్మా——మీకునను కరగదాయెనే-నే నేమిచేతును? (దగ్గరకు పోవును.)

సారం——(సులోచనను అడ్డును)

శ్రీద——(సారంగుని చేతులు గట్టిగా పట్టుకొనును)

సారం——(వదలించుకొనజూచి విఫలుడగును.)

శ్రీద——ఓ పృథివీ-నీవేల యీమంటి నిబ్బంది పెట్టుచున్నావు?

సార——ఓరి బోడీ-నీవెవడవు-నాయాలిని నేను పట్టుకోబోతే నీకేం? విడూ నాచేతులు.

సులో——స్వామీ-వీడసత్యము పల్కుచున్నాడు. నాయంతరమేమి? వానియంతరమేమి? బలిమిని నన్ను పట్ట జూస్తూన్నాడు. నన్ను వీని బారినుండి తప్పించి మీవెంట గొనిపొండు, మీసేవకురాలనై ఆమరణము మెలంగెదను.

శ్రీద——మూఢాత్మా-ఈతుచ్ఛసౌఖ్యమున కాసింతువేమి? మాయాకల్పితమైన ఇహసౌఖ్యము పోనాడి నిరతిశయానందము నొందుటకు సత్యపదార్థమైన అద్వితీయబ్రహ్మముతో నైక్యము పొంద యత్నించుము.

సార—అబ్బో! నీయేదాంత మెవరికి కావాలి? నీకారిన్నీవు పోయి ముక్కు మూసుక్కూర్చో. ఆడదాని మాటివి నామీద కొస్తావా? నూడు నా దెబ్బమరి-(అమ్ము గురిపెట్టును అదిచూచి శ్రీదత్తు డొరగిల్లును-చెట్టుచాటుననున్న ప్రతాపశీలుడు బాణము వేయ అది సారంగునకు తగిలి వాడు పడిపోవును.)

శ్రీద—మన్నా, మంటిలో గలిసిపో.
కామపాశంబులకు లోనగట్టు వడుచు
సొగసు పూతలకాయంబు చూచి వలచి
యముడు రోషాన పైబడునపుడు నాల్గు
చేర్లు తెగిన యుయ్యాలవలె చితుకు నరుడు.

సులో—(తనలో) ఈతడుత్తమవంశజునివలెనున్నాడు. చేయి సులక్షణరేఖాసమన్వితము-చక్రవర్తియగునో, లేక పరమహంస యగునో? ఈతని నాశ్రయించితినా నాకు తప్పక మేలు చేకూడును. (శ్రీదత్తు డటనుండి పోబోవును)

సులో—అయ్యో! స్వామీ! ఈ నట్టడవిని నన్ను డించి పోవుట న్యాయమా? మీవెంట గొనిపొండు, మీకు దాసినై యుందును.

శ్రీద—(సులోచనను చూచి కళ్ళుమూసుకొంటున్నాడు)

సులో—యోగీశా! నాకు నో రెండుతూన్నది. కొంచెము నీళ్లొసగండి- ప్రాణములు నిల్చునట్లు లేదు. నీరుండు

చోటైనా చూపండి.

శ్రీద— ఇదో భూతము దాపురించిందే! ఏమంటున్నావు? దాహమా! శివభోగమనే మహానందప్రవాహము పొంగి వెల్లివిరుస్తూంది-నీకు కావలసినంత తాగు-(పోబోవును)

సులో—అయ్యా! నాకు త్రాణలేదు-ఆప్రవాహము దరికి నేను పోలేను. నన్ననాథనుచేసి పోవ మీకు ధర్మమా? యోగీశ్వరులు భూతదయాపరిపూర్ణులని వినికి. మీ జీవకారుణ్యరసము నాపై చిల్కి నాకు భద్రము చేకూర్చండి.

శ్రీద—ఇదేదో కామినీభూతమువలె నుంది, నాకు బుద్ధిచెప్పవచ్చింది-నీకేమి కావలెనంటివి?

సులో— మొదట నీరు, పిదప ప్రాపు. ఆవశ్యకముగా ముందునేను కోరేది నీళ్ళు. పిమ్మట నన్నీ అడవిని దాటించి నాపైకృప వహించి మీచరణదాసిగాగొనండి. లేదా భద్రము చేకూర్చండి-మీ కమితపుణ్యము ప్రాప్తించగలదు.

శ్రీద—ఇదేమి ప్రారబ్ధము! ఓకామినీ! నీవు తిరుగ సంసారప్రపంచమున నేలపడెదవు? వనమందేఉండి తపమాచరిస్తూ కాలము గడుపుకో.

సులో—మహాత్మా- నేనజ్ఞురాలను. బ్రహ్మానుసంధానవిధాన మెరుగను-కాబట్టి నాయందు కృపవహించి కష్టములనుండి నన్నుద్ధరించండి-మీధ్యానజపదాటక మీకు సేవచేస్తూ నాయోగక్షేమ[illegible]న్నను. శరణంటిని, కరుణించండి-నన్ను [illegible]ండి. ఆర్త

ప్రాణమత్యధిక ధర్మమని కులీనులగుమీకు నేగ చెప్పవలెనా?

శ్రీద—మహాత్మా! నీపట్టు విడువనా? నీరోగము కుదిర్చిన నావెంటరా. నానవతి తల్లికి నిన్నొప్పచెప్పి కఠిన మైన దాస్యము చేయించెదను-రమ్ము.

సులో—మహాప్రసాదము! నీట ముంచినా పాలను ముంచినా మీదే భారము.

శ్రీద—ఓ పాపీ! నాదగ్గరరాకు- ఈ రువ్వలు పట్టుకో. అంతే దూరాననుండి నాతోడరా-నీ యదృష్ట మెట్లున్న నట్లగును.

సులో—(స్వ) ఆహా! ఏమి ఈవింత! మారసమాన సుందరు డీతనికింత చిరుప్రాయముననే విరక్తి జనించెను. సార్వ భౌముడు కాదగిన ఈతనిబుద్ధి ఇట్లు చలించినదేమి? సర్వ సంగపరిత్యాగి కాజనునా ఈతడు?అట్టైన సృష్టికి వైపరీత్యము ఘటిల్లవలెను—(పోవుదురు-)

---

## మూడో రంగము

---

వాసవదత్తుని ఉద్యానమున సులోచన-

సులో—పేరుచెప్పిన ప్రాణము పోవునని కట్టడ! కానీ నేను బయలుపడ నేల? రాజ కుమారినయ్యు దాసిని కావలసి వచ్చెను, ఇంతేకదా! వ్రేరేమిలోచ్చుకద్దు? చిత్రరేఖాదేవి నన్ను

కడుపున పుట్టిన పిల్లవలె ప్రేమించుచున్నది. ఇక్కడనే యావజ్జీవము గడపితే చెడిపోయినదేమి? తలవ్రాత తప్పింప తరమా? నేను కనబడనందుకు నా తలిదండ్రులెంత కుందుచున్నారో! లీలావతి నన్ను గానకనందు కెంత గాసిలుచున్నదో, పద్మాక్షి ఎంత దురపిల్లుచున్నదో!—నేను చనిపోతినని భావింతురో, లేక ఎటకైనా లేచిపోతినని ఎంతురో—ఏమైన నేమి చేయగలను? కానున్నది కాకతీరునా? నాబోటి నిర్భాగ్యురాలుండబోదు. శ్రీదత్త యువరాజునకు రాణినై నగళులలో నతివైభవమున నుండవలసిన దానను. ఆ యంతఃపురమునందే దాసినై యుండుట కన్న దైన్యత కద్దా?-కాని యువరాజు యోగమార్గము నవలంబించినాడు! ఈతనికి వివాహమెందుకు? ఈతని మనసు వ్యాకులితమైనదని చెప్పినారు. యోగ్యపరిస్థితుల నన్నిటిని చేకూర్చిన ధాత ఈతని చిత్తమునకు చాంచల్యమేల కూర్చెనో? ఐహికమన్న నసహ్యము చూపుచూ ఈతడానాడడవిలో నన్న మాటలునాకర్థముకాలేదు. ఈతనితీరిదే కాబోలు! ఆకారము చూడ భువనమోహనుడు-అట్టి వానికర్ధాంగిని కాగల్గు భాగ్యము నాకబ్బనుండెను, కాని ప్రకృతావస్థయందు నేనామాట తలపనేకూడదు. ఆతడు-చక్రవర్తిసూనుడు-నేను అల్పదాసిని-ఈతని పతిగా బడయ నామె ఎట్టి నోములు నోచవలయునో? స్త్రీజన్మమన్న నామెదే జన్మము. నాబోటి నిర్భాగ్యురాల కట్టి సుయోగము ఘటిల్లునా!

("సావిత్రీ" అని పిలుపు వినబడును.)

ఇదిగో వస్తూన్నాను.(త్వరగా పోవ వలయము జారును)

(ప్రతాపశీలుడు విచిత్రశర్మ వత్తురు)

విచి—మీా రిక్కడనే ఉండండి, నేను యువరాజును తోడుకొని వస్తాను. మనమిగువుర మేదో వేదాంతవిషయము చర్చించుసట్లు కనిపించి అతని హృదయస్థితాభిప్రాయము నెరుగుదము.

ప్రతా—ఇందువల్ల ప్రయోజనముండదు. అయినా తీసుకొనిరా చూతాము. (శర్మపోవును)

వింతగానుండే. నాబాణము తగిలి క్రిందపడడము చూచినాను; అది నొవ్వ తగలలేదో మో? బాణమువల్ల గాయము తగిలిందో లేదో ముందుచూడవలెను. ఒకవేళ యో గాభ్యాసి కావున బాణము తగలనేలేదా? నన్నాతడు చూ చెనా? అన్ని సంగతులూ తేటపడును. ఆప్రసంగ మెత్తకుండా నే సర్వమూ తెలుసుకోవలెను.

(శ్రీదత్తుడు, విచిత్రశర్మ, విక్రమవీరుడూ వత్తురు, అత డాసనములుచూపును. విక్రమవీరుడు కూర్చుండబోవ విచిత్రశర్మ దానిలాగగా వీరుడు నేలబడును.)

విక్రమ—అయ్యా-కోపించుకోకండి. ఈ యోాసనము మీా కాధారమో, లేక మీారే ఆసనమున కాధారమో దృష్టాంతీకరించడమున కిట్లు చేయవలసివచ్చెను-క్షమించండి.

(అందరూ నవ్వుదురు)

విచిత్ర—కావచ్చును (కోపముతో చూచును)

ప్రతా——ఎన్నడూ నవ్వని యువరాజుగారు కూడా నేడు నవ్వినారు. (కలయజూచి తనలో) ఏమిదింత ! కాయమం దొక గాయమైనలేదు. ఇందేదో మోసముంది.

విక్రమ——త్వరలో వివాహము కానుంది, నవ్వడము నేర్చుకోవద్దా ? (శ్రీదత్తుడు లేచి పోవజూచును) యోగీశ్వరా! సర్వమూ త్యజించిన తమకు కోపము రావచ్చునా ? కూర్చోండి.

శ్రీద——నీవన్నది నిజమే. కోపము క్రూరమైనది.

కోపము కతాన చెడె కౌశికునితపంబు
కోపము కతాన నహుషుని గొప్పకూలె
కోపము కతాన నింద్రుని కులిశమడగె
కోపమున చెడ్డవారలు కోటికోట్లు.

విచి——యువరాజా, మిమ్ము కొన్ని ప్రశ్నలు వేయవలెనని ఉన్నది. కోపపడక వాటికి జవాబిస్తే అడిగెదము.

ప్రతా——ఏదైనా నిజముగా నడుగదలచిన నడుగవచ్చును, కాని పరియాచకము వద్దు. హేళనచేయకండి జాగ్రత్త!

విచి——మీరిహసౌఖ్యముల సేవగించునట్లు వర్తించుచున్నారేల ?

శ్రీద——ఇందు వాంఛింపదగిన వస్తువు లేకపోవడము వల్ల . . .

విచి——ఈసుఖములు కోరదగినవి కావనడమునకు వాటినెల్ల మీరనుభవించి అసహ్యించుకొంటిరా ?

శ్రీద—అట్లు కాదు-నిరతిశయానందము పొందిన ఈ తుచ్ఛసౌఖ్యము లేమిటి?

విచి—అట్టి యానందమేది?

శ్రీద—కనునా మొకనొప్పులు బొం
దినకష్టము తెలియు కనక తెలియునె యఖిలం
దినవా డెఱుంగు నీసుఖ
మనువగునే రాతిగుండె యతని కెఱుంగన్.

అని వినలేదా?

విచి—ఆయానందము తా మనుభవించినట్లుంది.

శ్రీద—అది పొందుటకే అంతయత్నము చేస్తున్నాను.

విచి—ఇంకకొంత కాలము గతించిన వెనుక యత్నించరాదా?

శ్రీద—

పచ్చికమీది వాఃకణము భంగిని నిల్వదు దేహమంచు నీ
యిచ్చ నెఱింగి ధర్మముల నియ్యెడనే యొనరింపుమయ్య, దా
నిచ్చట నిల్చనొండె మరణించెను బందుగు లేడ్వనంచు, వా
కుచ్చు స్వభావముం గలది రూఢిగ జీవనయాత్ర యంతయున్.

రేపటి కాయము వుండునని నిశ్చయించుటెట్లు?

విచి—సర్లే, పెళ్ళివద్దంటే ఆ మహానందముట్టిపడునా?

పరి—పరియాచకము వద్దని మొదటనే చెప్పలేదా?

విచి—హాస్యము కాదు. ఆయానందము పొందుటెట్లు?

శ్రీద—నిన్ను నీవు తెలుసుకొంటే దానిని పొందెదవు.

విచి—నన్ను నేను తెలుసుకొనకేమి? పైత్యభ్రమ కల్గి

నప్పుడు దేహముపై స్మృతి తప్పునేమో కాని ఇతరవేళలనన్ను నేనెరుగనా? నేను విచిత్రశర్మను. నన్ను నేను తెలుసుకొంటిని. ఏదీఆ యానందము నాకు కలుగలేదే?

శ్రీద—నేనువిచిత్రశర్మనంటివే. "నేను" అనేదేది;

విచి—"నేను" అంటేనేనే. ఇదిగో నేను-నేను.

శ్రీద—ఈ శరీరమా?

విచి—అవును. అలాగే అనుకో.

శ్రీద—మిత్రమా,

నాదను నిప్పు, కీటకములు నాదను, మన్నగు భూమిదేవియున్
నాదను, గాముబందువుకు నాదను, తానుభుజింప తోడెలున్
నాదను, నక్క నాదనును, నాసికకున్వెగటైన కంపులో
నీదెకు వేళ, నీతనువునే ప్రియమారగ పెంచు టేటికో?
అను మాట మరచినావా?

విచిత్ర—సరిపోయింది. అయితేమరి నేననేదేదో నీవుచెప్పకూడదా?

శ్రీద—తెలియవలసిన విషయమదే.

తానదియో మరిందనకు దావలమేదొ యొరింగనేని తా
జానుగతావలంబునయి, సత్తయి, బ్రహ్మమునై, భవంబునే
మానును, నిన్నునీవెరుగుమా, మరియొట్టిది కీడుగాదుసూ
నేను వచించితీనుడిని నీవుప్రియంబుగ నన్ను గోరుటన్॥

విచి—అదినేను తెలుసుకొంటే నాకుకూడా ఆయానంద మబ్బేటట్లున్నదే?

శ్రీద—ఆ "నేను" మరణించిన తోడనే ఆనందముపుట్టును,

విచి—ఇదెంతహీనమైనది. "నేను" మరణిస్తే కద్దే ఆనందమూ నిరతిశయానందము? మరణించిన తరువాత ఆనందమనుభవించడమేలాగు, నుయ్యి త్రవ్వితే భూతము బయలుదేరినట్లుంది. ఇది అగమ్యగోచరము. యువరాజా! నాకొక సందేహముంది.

శ్రీద—అదెట్టిది?

విచి—ఆ యానందము పొందగోరుతూ ఉన్నమీరు హాయిగా ఈలోకమున మాఅందరితో కలిసి మెలిసి, పెళ్ళిచేసుకొని, దేశమును పాలించి, సౌఖ్యము లనుభవించుతూ, ఈలోగా నిరతిశయానందము పొందే మార్గమును తెలుసుకొని, పిదప ఆప్రవాహములో మున్గి తేలరాదా? ఇప్పటినుంచీ యత్నింపనేల? (గుణసేనుడు వచ్చును)

గుణ—మహారాజుగారూ దేవిగారున్నూ మిమ్ము గాంచవస్తూన్నారు. నన్ను ముందుగా నంపినారు.

శ్రీద—విశేషమేమి గుణసేనా?

గుణ—నాపై కోపగించకుంటే చెప్పుతాను.

శ్రీద—నీమీదనాకు కోపమెందుకు? చెప్పుము.

గుణ—మీకు వివాహముచేయ నిశ్చయించినట్లుంది. ఆవిషయము మీతో మాటలాడ వస్తూన్నారని తోస్తుంది. (శ్రీదత్తుడు తటాలున నిలుచును.) రాజు, రాణి, కమలాకరుడూ వత్తురు.

శ్రీద—(తండ్రికి నమస్కరించి) అయ్యా, మీరు నన్ను కని పెంచిన తండ్రులు, మి మ్మొకవర మడుగుతూన్నాను. అది తప్పక దయచేయవలెను.

చిత్ర—నాయనా, నీకు మే మివ్వరాని వస్తువున్నదా? నీ కేదికావలెనంటే దాని నిప్పించెదను. సంకోచింపక అడుగు.

వాస—అబ్బాయీ! అట్లే యిచ్చెదను-అడుగు.

శ్రీద—నన్ను వివాహముచేసుకొమ్మని నిర్బంధింప వద్దు. ఇదే నేను కోరునది.

వాస—శ్రీదత్తునితో వివాహప్రసంగము చేసినవా రెవరు? గుణసేనా! నీపనేనా ఇది?

గుణ—మహారాజా, నే నేమిచేయుదును? తా మిరువురు వారితో మాటాడనచ్చుచున్నారని చెప్పితిని. ఏవిషయమున అని అడుగుటచేత నాకు చెప్పక తప్పిందికాదు.

చిత్ర—నాయనా, నీ వేదైనా వస్తువడిగెద వనుకున్నాను, కాని ఇదేమి కోరరానికోరిక కోరినావు?

వాస—నాయనా, నా కేకపుత్రుడవు-నీవు వంశోద్ధారకుడవని మురిసిపడుతున్నాము-అట్టియాశాలతను తెంచుటకా నీవు పుట్టినావు? ప్రకృతమున హస్తినాపురరాజగు ధరాకీర్తి మకేతు కూతుళ్లలో నొకర్తెను నీకు వివాహము చేయనెంచి రాయబారి నంపితిని. తన పెద్దకుమార్తెయగు లీలావతిని నీ కిచ్చి పెళ్లిచేయ సమ్మతించి, అందరూ బయలుదేరి రేపే

యూరుపత్తుమని వారు వ్రాసినారు. వారందరూ వచ్చిన పిమ్మట వారి నెట్లు సమాధానపర్తును? మొండిపట్టు పట్టుట నీకు తగదు-మమ్మందరిని నిరుత్సాహపరుచుట నీకు భావ్య మా?

చిత్ర—నాయనా శ్రీదత్తా, నీతండ్రిగారి మదికి నచ్చి నట్లు నీవు ప్రవర్తించుము-నేను చెప్పుట నీక్షేమమున కే-నీపట్టు విడువుము-లీలావతిని పెండ్లియాడి మమ్మందరిని సుఖపెట్టుము. సుపుత్రునికిదే యవశ్యకృత్యము-లీలావతి మంచిసౌందర్యవతి, బుద్ధిమతి.

శ్రీద—అమ్మా! ఆమాటతప్ప ఇంకేదైనా విందును. నాచిత్తవృత్తి మీ రెరుగనట్లుంది- వే రేమిచేయుమన్న చేసి తీరెదను.

వాస—సరే-నీవన్నమాట నిల్పుకొందువా? వే రేమి చేయుమన్న చేసెదవుగా కుమారా?...ఊరకున్నా వేమి?

శ్రీద—మాటతప్పను-అట్లే చేసెదను.

వాస—శ్రీదత్తా! పురాతనమగు మనవంశము నశింప కుండేలాగు, నీవూ నేనూ గతించినపిమ్మట మనరాజ్యమును పాలించుటకు తగిన పౌత్రుని కొనితెమ్ము.

శ్రీద—ఏమంటిరి? (నిర్ఘాంతపడును)

విచి—కీచురాయి దాని గొంతుకవల్లనే చెడిపోవును.

వాస—పరిహాసమువద్దు-ఇక్కడ నీ కేమిపని, పో-

విచి—కుమ్మరి గూన, కమ్మరి బాన, నిమిషములో

సిద్ధముచేయగలరు-ఇదిగో పోతున్నాను. గుణసేనా, ఇక సమాచారముండి ఇలాగురా. (పోవుదురు)

శ్రీద—అయ్యా! పెద్దలగు మీకు తోచినదిదా? ఇంతమాత్ర మాలోచింపరైరి. నేను వివాహము చేసుకోకుండా పుత్త్రి నెట్లు తేగలను? అసాధ్యమైనదాని సాధించు టెట్లు? వివాహము చేసుకొమ్మని బలాత్కరించవద్దని వేడుకొంటిని. మీరాపని మానకుంటిరి!

వాస—శ్రీదత్తా, నీవు న్యాయాన్యాయచర్చచేస్తే లాభము లేదు, వివాహము చేసుకొమ్మని నిర్బంధించవద్దంటివి, నే నట్లు చేయలేదు; నాకొక పౌత్రునికని యిమ్ము.

శ్రీద—దానికర్థ మేమి?

వాస—వృథావాగ్వాద మెందుకు? నీవన్నమాటతప్పనంటివి. నీవు చదివిన శాస్త్రములలో తండ్రిమాట తప్పవలెనని ఉంటే అట్లేచేయుము, లేదా నామాటవినుము. సత్పుత్రుడవనిపించుకో-దేవీ,పోదాము రా.

శ్రీద—కమలాకరా! నాకీజన్మమేల దాపురించెను?

చిత్త—నాయనా, వ్యసనపడకు. ఆడితప్పనివాడవైతే, మీతండ్రిగారి మాట నిర్వహించుము. ఈవస్త్రములను త్యజించి నీకుతగినవస్త్రాభరణములు దాల్చుము-మేముచెప్పేది నీమేలుకేసుమా. మేము పోయివత్తుము-(రాజూ రాణీపోవుదురు)

ప్రతా—మహారాజుగారితో మాటలాడుటకిదే సమయము (పోవును)

కమ—యువరాజా! ఇంక చింతించిన లాభములేదు. మీరిట్లు దుఃఖించిన మేమెట్లు సహించగలము?

శ్రీద—తల్లీ, పృథ్వీమతల్లీ-ఇదే నీచెంత జేరుచున్నాను. వేరు తోవ కానరాదు. కమలాకరా! శ్రీదత్తుడను వాడసలే పుట్టలేదనుకో. ఏదీ బాకు నిటుతే-నీవుపో—(లేచును)

కమా—అయ్యో! తొందర పడకండి.

శ్రీద—కమలాకరా! నామాటవినవా? నాబాకు నిచ్చి నీవుపొమ్ము.

కమ—నామాటవినండి. ఈకాయము తొరగిన మీ దుఃఖమంత రించునా? మీమాట నిల్పుకొనజాలదురా? ఆత్మ హత్యాపాతక మొనర్చి జన్మాంతరములయందు పలుదుఃఖ ములపాల బడెదరా? ఆపాప మూరక పోవునా?

శ్రీద—ఔనౌను-కమలాకరా-నీవు చెప్పేది నిజము. ఇదివర కెత్తినజన్మమేచాలును. ఇంకజన్మము లెత్తలేను...కాని ఈవిషమసంకటమునుండి తప్పించుకొనుదారి తోచదాయెను.

కమ—నామాట వినండి. సర్వమూ తెలిసిన మీకు నేనుపదేశింపగలనా?...మీరీ పిన్నవయసున సన్యాసము బూనడము న్యాయముకాదు—

చేయగనొప్పు కర్మమును చేయక డెందపుమచ్చ బాయకే
చేయుచునున్నచో తపముసిద్ధిని పొందునె యెట్టివారుగా
మేమెడ బుత్రులంగనకయే నరులెల్ల వసించు నాకలో
కాయతనంబునందు నడుగైనను నుంచగలేరు భూవరా.

మహర్షులుకూడా గృహస్థాశ్రమమునను:ండి సుఖదుఃఖములనుభవించి పిదప తురీయాశ్రమ స్వీకార మొనర్చినారు, మీారట్లేల చేయరాదు? సద్గుణవతియు అనురూపవతియునైన యువతీ రత్నమును వివాహము చేసుకొని, కొంతకాలము గృహస్థ ధర్మమాచరించి, తల్లిదండ్రులను, బంధువులను, మమ్మాసంతసింపజేసి పిమ్మట సన్న్యాస మాచరింపరాదా?

శ్రీద—కామిని యనెడి భూతమునైజము నీవెరుగవు-ఆవ్యామోహాంధకూపమున పడినట్టైతే బైటకు రాగలనా? అసంభవము, రాలేను.

కమ—అయ్యా! మీారు స్త్రీల నందరిని ఒక్కరీతిగా భావించ గూడదు. వాళ్ళలో మాత్రము మంచివారుండరా? కొందరు నారీశిరోమణులు తమ భర్తలను యుక్త సమయము లందు సన్న్యాసమార్గము నవలంబించ పురిగొల్పినారని జ్ఞానవాసిష్ఠము మొదలగు గ్రంథములయందు చెప్పబడియున్నది-ఇది మీాకు తెలిసే యుండును. మీారట్లేల చేయకూడదు? ఇహపరోత్కృష్ట సాధనమగు గృహస్థాశ్రమమును గర్హింప గూడునా?

ధర్మసిద్ధిగ గృహస్థత్వమరిన త్యాజ్య
కర్మపథ మరయ వేరేల?

శ్రీద—ఛీఛీ! ఆతుచ్ఛసౌఖ్యములలో నేమున్నది?

కమ—అట్లుకాదు. అంత చులకన చేయకండి-ప్రేమ యొక్క ఉన్నతి నెరిగిన మహాకవులు చెప్పినవాక్యము చెడ్డది

కాదు. అనుభవశాలులమాట అన్యథాకాదు. అసుఖ మను భవించే వారికి దాని రుచిదెలియును. గుణవంతుడు సత్కార్యానురక్తుడుగు నొక పురుషుడు, ఒకయువతీలలామను ప్రేమించి, ఆయువతీశిరోమణియు నాతని తత్తుల్యప్రేమతో గారవించెనేని, ఆదంపతు లనుభవించు సౌఖ్యమే ఉత్కృష్ట సౌఖ్యము. అంతకన్న నుత్తమసౌఖ్యమీలోకమున నుండదు. ఆదంపతులు వియోగమన్నదిలేక జీవించు దృశ్యముకన్న సుందరతరదృశ్య మిహమున లేదు. దైవకటాక్షమున నట్టివారి కొకతనయుడు కలిగితే తేనెనుబోలు రసము చిప్పిలుచుండు మామిడిపండు చిక్కని పాలలోపడున ట్లుండును.

శ్రీద—మిత్రమా, కమలాకరా, నీవు చెప్పినది కలియుగమునకు తగినదికాదు. ఈప్రపంచములో పెనిమిటిని సదాప్రేమించి పూజిస్తూ కాలము గడచినపిమ్మట నాతడు సన్యాసి కాదలచిన అందుకు సమ్మతించు స్త్రీలుందురా? కల్ల.

కమ—యువరాజా, మీరట్లు తలంచవద్దు. ఈకాలపు స్త్రీ లెంతచెడ్డవారైనా కొందరైనా మంచివా రుండక పోరు. అట్టియామెనే వెదకి పెళ్ళియాడకూడదా?

శ్రీద—నీమాట నిజమే. కాని, కమలాకరా, మనము వ్యర్థముగా కాలము గడుపుతున్నాము-మృత్యు వనుక్షణమూ మనల తలపట్టి యీడుస్తూన్నదనుమాటే మరచి ఏమేమో ఆలోచిస్తూన్నాము.

యముడీదెవచ్చి పై బడనియప్పుడె కన్నులలోన పల్పొరల్
గమియనియప్డె దౌడలనుగారుచు పాలును జారనప్పుడే
గుమిగొని బంధువర్గమును గొల్లున నేడ్వనియప్డె యూరివా
రెముకలపైని నిప్పిడి దహించనియప్పుడె చేరుగుమాలున్.

అని మనము నడువవలసిన మార్గము నెరుగక వృథాగా గడపితిగదా ఇంతకాలమున్నా; కమలాకరా, నామనము కుదుటపడకున్నది. ఏదీ "మనమనువానరంబు" అను పద్యము-

కమలా—

మనమను వానరంబు వనమధ్యమునం బడి త్రుళ్లుచుండ, దా
ని ననుసరించు కార్యమున నేమిటిలాభము? యొక్కటౌచు సె
క్కునునగుచుండి ప్రాణములకున్మరి ప్రాణమునై కృపానిరీ
క్షణ ఘనకాంతుల న్వెలికి జల్లుచు నాడెడి దివ్యజ్యోతినే
యొనయగరండు కాలమిదె యెల్లజగంబుజనంబు నీయెడన్.
మనమను వానరంబు మదమైకమునన్ సతతంబు మోహపున్
వనమున దూకులాడు కుచపర్వతశృంగమునగ్రమందు......

శ్రీద—ఇదేమిటి? కమలాకరా, నేనొకటి చదువుమన్న నీవొకటి చదువుతూన్నావేమి? మరపుచొప్పున నేను తెలుసుకొనలేకపోతిని...(ఇటూఅటూ చూచి గాజు తీస్తున్నాడు)

కమ—అయ్యా, క్షమించండి. నేనుకూడా మరపుచొప్పుననే చదివినాను. ఇది వసంతకాలమవుటచేత నామనస్సు శృంగారరసము పై పాకర్షింపబడ్డది...సరే కాని-మీచేతిలోది

నగవలె ఉంది, అది మీ కెందుకు?

శ్రీద—ఈక్రింద పడియున్నది-ఎవరిదో?

కమ—నే నాలోచిస్తూన్న దదే,-నాకు సందేహము గానే ఉంది. (తనలో) మంచితరుణమిదే.

శ్రీద—హాస్యమాడుతున్నావా?

కమ—అబ్బే, లేదు లేదు-ఇది దెవరిదో మీకు తెలుసునా?

శ్రీద—తెలియదు-నీ వెరుగుదువా?

కమ—ఆనాడు నట్టడివిలో ననాధగా నుందని మీరు పిల్చుకొనివచ్చి చిత్రరేఖా దేవిగారికి దాసిగా నప్పగించిన రూపవతి యాదియున్నదా? ఆయువతి పనినేర్పునకు సంతసించి చిత్రరేఖా దేవిగారు బంగారుగాజురు బహుమానముగానిచ్చి నట్లు నాతో చెప్పినారు. అదేయిది...అయ్యో, ఆమె యెవ తెయో మీ రెరుగుదురా?

శ్రీద—నా కేమి తెలుసును? నన్నడిగెద వేమి?

(సులోచన గాజు వెదకుచూ వచ్చును.)

కమ—ఆమెసౌందర్యవతి యనియు గుణవతిఅనియూ దేవిగారు మిక్కిలి సంతసముతో ప్రశంసింతురు. చూచుట కామె రాజకుమారి లాగుంది—అదిగో! పాపము! దీనిని వెదకుచు ఆమె ఇటేవస్తూన్నది. ఇదా మెకిచ్చివేతాము. (తీసుకొని) మీరున్యాయముగా ఆమెకొసంగడము నామతము కాదు. మీరు సర్వమూ త్యజించినవారైనా రూపవతియగు కాంత

షుందర మీరు నిలుచబడడము నాకిష్టములేదు. ఏవేళయెట్టి దో. విదూషకుడు చెప్పినట్లు విరాగులగు మీరు సరాగులవు దురేమో!

శ్రీద—(గాజును తీసుకొని) కమలాకరా! నన్నల్పుని గాభావిస్తూన్నావు. నాకామాత్రము మనోదార్ఢ్యములేదని యెంచుతూన్నావు కాబోలు. వేయిమంది స్త్రీలమధ్య నిలచినా నామనస్సుచలింపదు. ఇప్పుడే దీనికి తార్కాణముగా నీవస్తువు నామెకిస్తాను చూడు.

కమ—యువరాజా! నామాటవిను. నీవివ్వవద్దు. అదినాచేతికిమ్ము. (పుచ్చుకొన బోవును)

శ్రీద—వద్దు. నామనసంత గట్టిది లేనిదనిఎంచితివా?

కమ—నేనుచెప్పవలసింది చెప్పినాను. ఆపైనితమ చిత్తము. రాయితన్వనేల చేయినొవ్వనేల? నాచేతికిస్తే నేనామె చేతికి తొడిగించి వచ్చెదను.

శ్రీద—అబ్బ! అదినేను చెయ్యలేనా? చూస్తూండు. (సులోచన చెంతకేగి), యువతీ ఇదినీదా?

సులో—(తలవంచి) ఔను.

శ్రీద—ఇదిగో—దీనిని—తొడుగుకో　(ఆమెకిచ్చును)

సులో—(గాజుతొడుగుకొనునప్పు డిరువురి దృష్టులు తారసిల్లును. పిమ్మట ఆమె బిరానపోవ శ్రీదత్తుడు నిదానించి తిరుగ కమలాకరుని చేరును)

శ్రీద—మిత్రమా, ఇప్పుడేమంటావు?

కమ—(నవ్వుతూ) అనడానికేముంది?

శ్రీద—నాదిటవు గాంచితివా?

కమ—నామాట విన్నారుకారు—నేనేమిచేయుదును?—కాదలచింది కాకమానదు, విచారించిన ప్రయోజనములేదు.

శ్రీద—నీమాటలు నాకర్థముకాలేదు. నేను మొత్తపడినానని యెంచుచున్నావు కాబోలు? ఆకాంతను నేను వలచినావనియూ నీయూహ. చాల్చాలు. ఇన్నాళ్ళు నాతో మెలగుతూన్నా నైజము నెరుగలేక నన్ను చులకనచేస్తున్నావు!

కమ—అయ్యో, కుట్రగలమనస్సు గుట్టుగుట్టునునన్నట్లు నేనేమీ అనకుండానే మీరు వర్ణనవేయుచున్నారే! దాచియుంచిన లాభమేమి?

శ్రీద—కమలాకరా!సరిపోయింది. నీకేమిపిచ్చిపట్టిందా?

కమ—నాకు పిచ్చియే పట్టింది. మీరు కోరినదానిని శీఘ్రముగా పొంది చిరకాలము సుఖజీవిక నల్పుదురుగాక!

శ్రీద—ఏమాలా గంటున్నావు! నామనస్సు మారిందనేనా నీఅభిప్రాయము?

కమ—నన్నేల అడిగెదరు? మీకళ్ళ నడుగండి. మీయిరువుల దృష్టులొండొంట సంధించునప్పుడు వాటి నడిగితే అవినిజము చెప్పియుండునే.

కనుకన్నుజూచి సైగలను నెచ్చెలులైన
ననెడి మాటల ఫలంబేమి?

కొంచె మోపికపట్టండి. రెండుమూడు రోజులలో

అంతా తేలిపోవును.

శ్రీధ—మిత్రమా, నీ అనుమానమునకు హేతువులేదు. నామాటవిను.

కమ—మాటా అక్కరలేదు మంతీ అక్కరలేదు. వినడానికేముంది? పంచరంగులచిలుకనే పట్టినారు-అదీ కొంత మేలే.

శ్రీధ—నీకు నిజముగా పిచ్చిపట్టించినదుసుమా-ఇక నావద్ద ఆ ఊసెత్తకు. (గుణసేనుడు వచ్చును).

గుణ—యువరాజా! దేవిగారు మిమ్ము వేగముగా చూడగోరుతున్నారు.

శ్రీధ—సరే-ఇప్పుడే వస్తూన్నాను. (గుణ॥పోవును)

కమ—దేవిగారితో ఈసంగతి చెప్పుదురా?

శ్రీధ—మిత్రమా, కలవరిస్తూన్నావా? తెలివి తెచ్చుకో.

(పోవుచూ) ఆమెపేరేమి కమలాకరా!

కమ—చూచినారా? నేను చెప్పలేదూ...సరే-ఆమె పేరూ...సావిత్రి...(పోవుదురు.)






# మూడో అంకము

——

## —•మొదటి రంగము•—

(శ్రీదత్తుని ఏకాంత మందిరము.

శ్రీద—(నిల్వుటద్దము నెదుట నిల్చి) ఈ వస్త్రాభరణములను దాల్చుకొనే విధానము కూడా మరచినాను. ఈ వేషముతో నలుగురెదుట నిలువగలనా? ముఖము సుందరకాకున్న కన్న చాలైనప్పుడైనా హేళన చేయరా? సంసారబంధములను త్యజించి సన్యాసి కాదలచువానికి ఇవన్నీ చక్కగా నమరునా? ఎట్లైనా, చిత్రరేఖా దేవిగారి కిచ్చిన మాట చొప్పున నడవక తీరదు. ఈ అమూల్యాంబరాలంకారములు నేను కోరి ధరించినవికావే. అన్ని వస్తువులూ నాకు సమానము లయినప్పుడు నేను వేటిని ధరించిననేమి? దీని మాటకేమి?—ఛీఛీ... నే నెంత మతిపోయినవానిలాగు వర్తించినాను. వివాహము నాకు సమ్మతమని చిత్రరేఖా దేవిగారితో బాస జేసితిని! ఎంత తెలివిమాలిన పని! పెండ్లియాడిన పిమ్మట నా వైరాగ్యవృత్తి ఏ మవును? నా బుద్ధి నన్ను

బాసిపోయినట్లుంది. సందేహము లేదు. కమలాకరునికి పిచ్చి పట్టిందని హేళనము చేసితిని కాని నిజముగా నాకే మతి పోయింది...దీని కంతటికీ కారణ మా సావిత్రే. ఛీ, ఛీ, ఈ కుదృత్తి నిప్పుడే అణచివేయవలెను. సన్యాసమార్గము పట్టిన నాకు స్త్రీవాంఛ యేల? ఎంత బుద్ధిమాంద్యము! జీర్ణమై రాలిపోవగు క్షణభంగురమైన ఈ జన్మము సత్యమని భావించి తుచ్ఛసుఖత యను పంకములో మునుగబో తున్నాను. స్త్రీ యను శబ్దమును కలనైన వినగూడదని యెరిగీ, మోహాచారుల చిక్కుకొంటిని! అందుచేతనే విరాగులు విలాసినులవంక కన్నెత్తి చూడరాదను నుడియందలి సత్యము నేను కంటిని. ఈ పాడుగోతిలో పడితినా పైకి వచ్చుట అసాధ్యము...ఎన్ని విధముల మరువజూచినా ఆ సావిత్రి నా హృదయమును బాసిపోకున్నది...ఛీ ఛీ...ఈ సంగతి మరచిపోవుటకు పాశురముల చదువుకొందునా?

మనమనెడి దోనె నోపం
బను సరకును బెట్టి బుద్ధియనిమెడి కోలన్
ఘనముగను నూది భవవా
ర్ధిని జనునెడ మదవశిలయను తెరవున నడ్డో.

(తెరలో «అట్లే చేస్తూన్నానమ్మా» అను సావిత్రి మాట వినబడనాగి, కొంతసేపిటునటు చూచి నిట్టూర్పు విడిచి)

సావిత్రి కంఠధ్వనివలె నున్నదే! అవును-సందియమేల!

ఇంకొకసారి స్వరమైన నా పేరు? కెంత వింతగా నుండునా?...
అయ్యో తిరిగి ఎప్పుడు వినబడునో కదా? సావిత్రీ, ఇంకొక
సారి పలుకవా? నీ సుధారసము జిహ్వ చొక్కులిక నోలు
కవా? సావిత్రీ...ఛీ ఛీ...ఇదేమి ప్రారబ్ధము-ఈ అపరాధము
నానాలుకను మొదలంట నరికినను తీరదే! అయ్యయ్యో-
దుర్గంధభూతమగు స్త్రీకేతువు నస్మృతవర్తియని తలపతిని.
అయ్యో! అయ్యో! నాకు నిజముగా మతిపోయింది-ఎవరైనా
నన్ను చూచి నవ్వరా? నేను నిర్వర్తింపదలచినవిధి యిదా?
నా మానసము నెంత త్రిప్పదలచినా సాధ్యముకాకున్నదే.
కమలాకరు డన్నట్లు నుదుట న్వ్రాసిన వ్రాలుకన్నగలదా
నూరేళ్ళు చింతించినన్? ఆహా!

విధికంటె దృఢతరం బెదిగలదు తప్పకొన
మది నెంచుటకు మున్నె యురుకన్.

(మూర్ఛిల్లును)

కమలాకరుడు వచ్చును)

కమ—బళిరే...ఇంకేమీ చేయనక్కరలేదు. ఇంతే
చాలును-ఈ ధర్మసూక్ష్మము నెరుంగక మహారాజుగారు
కల్లడిల్లుచున్నారు. యువరాజా! నిద్రా! పరుంటిరేమి?

శ్రీధ—మిత్రమా, కమలాకరా!

కమ—యువరాజా, నేనే. ఇప్పుడు మీరేవిషయము
యోచిస్తున్నారో నేను చెప్పనా?

శ్రీధ—చెప్పు. చూదాము.

కమ—నేను చెప్పేది నిజమయితే నిజమని ఒప్పుకో వలెను. ఒక్కపదములో చెప్పగలను.

శ్రీద—ఏదీ చెప్పూ.

కమ—సావిత్రి...

శ్రీద—నిజమే. కమలాకరా, ఆమె నానాదు వనము నుండి పిలుచుకొని రావడము గొప్పపొరపాటుగనూ. పిమ్మట పూదోటలో నామెను చూడడ మంతకన్న గొప్పపొరపాటు. ఏమందువు?

కమ—వాటికొరకు దుఃఖించుచున్నారా! అలాగు కావడమే మేలయియుండునని నేను న తలుస్తున్నాను.

శ్రీద—కమలాకరా! నీ వేమీ యెరుగవు.

కమ—(నవ్వుతూ) ఔను-నాకేమి తెలుసును?

శ్రీద—అదికాదు. సావిత్రిని మోహించినాననేకదా నీ అభిప్రాయము?

కమ—ఆమాట న న్నడుగుతారేమి? మిమ్మే మీరడుగవలసిన విషయమది...అదటుండనీయండి-మీరీ వస్త్రాభరణముల నేల ధరించినారు? ఇప్పుడు మిమ్మానవాలుపట్టడమే కష్టముగానుంది.

శ్రీద—చిత్రరేఖాదేవిగారికి మాటిచ్చినాను కావున ఇట్లు చేయవలసివచ్చింది-తప్పనిసరియైనది- గార్హస్థ్యము కోరి ఇట్లు చేసినానని యెంచుతున్నావు కాబోలు?

కమ—అబ్బే! అ ట్లనుకొందునా? ఈవేషము పూ

నడముచేత సావిత్రియనురతీదేవికి నవమన్మథునివలె నున్నారు.

శ్రీద—నీవెట్టి కుదిరినట్టులేదే! ఇంకా ఆ తిక్క తిరుగనేలేదు.

కమ—అది పోయేదికాదు, కాని నాకొక సంశయము పొడముతున్నది. సావిత్రి దాసికదా, మూర్ధాభిషిక్తులు కాగల మీరు ఆమెను వివాహ మాడవచ్చునా?

శ్రీద—దీనిని తీర్పుటెంత? ఆమె దాసియైనా లోకమునకెల్ల చక్రవర్తినియై పాలింపగల యోగ్యతామెకుంది. ఈ భూలోకమంతా గాలించి చూచినా ఆమెవంటి సద్గుణవతియగు సతీలలామను గాంచుట అరుదు. ఆమె కామెయే సాటి. అదీకాక నిసర్గప్రేమ కులము, రూపము, సిరి మొదలైన పరిస్థితులను పరిశీలింపక వాటి నతిక్రమించుననుధర్మసూక్ష్మమును మరచితివా? ఉత్తమప్రేమ సంగతి నీ వెరుగవు.

కమ—ఔను, పామరుడనగు నాకు ప్రేమస్వభావ మెరుకపడుటెట్లు? సర్వసంగ పరిత్యాగ మొనర్పదగిన త్యాగశీలయోగివరేణ్యుల కది యనుభవగోచరము.

శ్రీద—మిత్రమా, చక్కగా జ్ఞప్తికి తెచ్చితివి... ఇంకొక క్షణమైనా సావిత్రియున్న యింటిలో నేనుంటినా, నా సన్యాసము నశించిపోవును, అందరి హేళనమునకూ పాత్రుడనవుదును... కావున... ఇప్పుడే... ఈక్షణమే... ఈ నగరము విడిచి దేశసంచారము చేసెదను. ఇంతలో ఈబంధమును తెంచివేయకుంటే నా ఉత్తరగతి ఏమవును?

కమ—అయ్యో ! ఏమి విపరీతము ! పండు సరిగా పక్వమైనవేళ ఉశత కొరికినట్లయిందే! తామసించి తొందర పడకండి.

(శ్రీదత్తుని చెయ్యి పట్టుకొనును)

శ్రీద—నన్ను విడువు. నీకిష్టమయితే ఇక్కడనుండు. నే నింకొక క్షణమైనా ఈ కాంత యున్నచోట యుండను. ఇంకోసారి ఆమెను చూస్తే...వద్దు...విడువు నాచెయ్యి.

కమ—సరే. మీ రీయూరు విడవనేల? ఇప్పుడే ఆమె నిటనుండి పంపివేసెదము. వీడ వదలుడు.

శ్రీద—అది న్యాయముకాదు. మిత్రమా! పాపమా యబల...ఏపాపమెరుగని ఆగోల...నిష్కారణముగా నాకొర కిడుమలపాలు కానేల? జీవకారుణ్యమే యోగిపదవికి మొదు మెట్టు. భూతదయలేనివారు సన్యాసులు కాజాలరు. ఆ పసి బాల యిక్కడనే యుండనీ. నేనే పోవుదును.

కమ—ఆలాగే మీరు పయనించవచ్చును గాని, తత్పూర్వము నాప్రశ్నకు సమాధాన మివ్వండి. లేకున్న మిమ్ము పోనివ్వను.

శ్రీద—ఒకటికాదు, పదడుగు. నాకు తోచినట్లు జవాబు చెప్పెదను.

కమ—నిర్దోషియు అమాయికురాలునైన అబలను చంపిన యోగికి పాపమువచ్చునా రాదా?

శ్రీద—శివ శివ. అట్టిమాట అనకూడదు, విన

గూడదు.

కమ—మీ కట్టిపాపము ఘటిల్లవలెనని సాకల్పముంటే మీ రీనగరు విడిచి యిష్టమువచ్చినచోటికి పోవచ్చును.

శ్రీద—మిత్రమా! ఏమట్లనుచున్నావు? అట్టి ఘోరపాతకము నామెడకు చుట్టుకొనుటెట్లు?

కమ—అయ్యా, నిదానించి కూర్చుంటే అంతా వివరముగా మనవిచేస్తాను. (ఇద్దరూ కూర్చుందురు.) యువరాజా! గుణవతియు వివేకవతియునగు నొక అబలామణి మిమ్ము త్రికరణశుద్ధిగా ప్రేమించింది. ఈ జన్మమున తానను భవించగల సౌఖ్యములన్నిటికీ మీరే ఆధారమని భావిస్తూంది. మిమ్మే నమ్ముకొని మీరే శరణ్యులని యెంచి సదా మీ నామమే జపిస్తూ మిమ్మే ధ్యానిస్తూ, మీ ప్రేమ జీవాధారముచేసుకొని, తన సర్వస్వము మీకు ధారపోసి లోలోన సంతసిస్తూ మీకృప నెదురుచూస్తూ జీవయాత్ర నల్పుతూన్నది. అట్టి భక్తురాలకు కీడొనగూర్చుట ధర్మమా? ఒరుల మానసము నొవ్వజేయకుండడమే మీ బోంట్లకుత్తమ విధియని ఇప్పుడే వచించితిరే! అట్టియెడ గుణములపోగు స్త్రీరూపము ధరించెనని చెప్పనొప్పు కన్యకామణిని కారియపెట్టి, ఆమె యాశాలతల తెంచి, ఆమె తలచినతలపుల నెల్ల కలగబెట్టి, మీరే శరణమని పూర్ణముగా నమ్ముకొనిన నవలాలలామ జీవనము వమ్ముచేసి, తుదకు మీ వియోగబాధ

సహింపలేక తనువు తొరగ జేయుట ధర్మమగునా? స్త్రీహత్య యే నిష్ఠురకాతుకకర్మ, సకలసద్గుణనిధానయగు దానను నమయ జేయుడము. ఎంత నీచకృత్యమో, ఎట్టి ఘోరభయా వహమో ఇంచుక యోచించండి. అట్టిది మీవంటివారికి అర్హకృత్యమా? మీరే దైవమని భావించు మానవతికి వెలుచి మీ రీనగరము బాసి,సంసారముకోసి, సన్యాసమార్గము నవలంబించి . ఆమె జీవము బాయుట ధృవము - ఆపాపము మిమ్ము జుట్టిముట్టును.

శ్రీద—మిత్రమా, నీవు చెప్పునది నా కగమ్యగోచర ముగా నుంది. నన్నట్లు ప్రేమించు నాతి యెవతె?

కమ—ఏమీ తెలియనివానిలాగు అడుగుతున్నారు! అయ్యా! సావిత్రి నమసిపోవలెననీ, అందుకు హేతువైన మీకా అపకీర్తి రావలెననీ మీకు ముచ్చటగానుంటే మీ రీయూరు విడిచి పయనించండి. తెలిసియుండీ చెప్పవేతివని నన్నప్పుడు నిష్ఠురములాడవద్దు.

శ్రీద—ఏమీ! సావిత్రికి నాపై ప్రేమానురాగ ముందా? నీవు నిజమాడుతున్నావా, లేక పరియాచకము చేస్తున్నావా?

కమ—యువరాజా! హాస్యమునకు దేశకాలపాత్ర ముల నరయలేనంత అవివేకి ననుకొన్నారా? మీ రించుక జ్ఞప్తి తెచ్చుకొనండి. ఆనాడు పూదోటలో మీ దృష్టు లొండొంటు తారసిల్లినప్పుడే ప్రేమోదయమైనదని నా తలంపు.

శ్రీధ—సరిసరి- దాని నాధారము చేసుకొని ప్రేమ గగనహర్మ్యములు కట్టి సావిత్రి నాపయి మరులుకొన్నదని నన్నుకూడా భ్రమపెట్టుతూన్నావా?

కమ—అయ్యా, తొందరపడక నామాట సాంతముగా వినండి. నాటిమొదలు నాకు సందేహముండేది, కాని నిన్నరాత్రి సర్వసంశయములూ తీరినవి. నిన్నరేయి ఎందుచేతనో నిద్రరాక మీ నందనవనమున విహరింప పోయియుంటిని. ఆనడిరేయి సచ్చట మెల్లగా తనలో తానేడ్చుచున్న స్త్రీకంఠము వినబడగా అడుగులచప్పుడైన వినబడకుండునట్లు చెట్లచాటున నుండియే వెళ్ళిచూచేసరికి మీరు సాధారణముగా కుర్చుండే స్ఫటిక శిలావేదికపై కూరుచుండి, మీపటమొకచేతబట్టి దానిని పలుమారు ముద్దుగొంచూ, లోలోన నేడుస్తూన్న సావిత్రిని కంటిని- వెన్నెలలో నిది యెల్లస్పష్టముగా కనబడేసరికి నాగుండె నీరైనిశ్చేతనుడనైతిని. మీరు పద్మకిచ్చిన పటమయి యుండవలెనని ఊహించితిని కాని, అది సావిత్రికెట్లువచ్చినదో తెలియదు. అప్పుడామెను చూచిన రాతిగుండెలుకూడా కరగకమానవు- మిమ్ము సంబోధించి ఆమె యాడిన దీనవాక్యములు సూర్యకాంతశిలనైన నీరుగాచేసి తీరును. వాటిని సానుభూతితో వచించుట కొకనోరు చాలదు...ముడిమాటలు చెప్పుచున్నాను. మీయందలి ప్రేమచేత నామె చిక్కి కొనయూపిరినున్నది- మీ రామెయెడ నుదాసీనులై ఊరువిడిచి పోవుచున్నారని విన్నచో మొదలునరికిన

మాలతీ:తపోతా ఆకోమలాంగి ప్రస్ఫుటనిజము. చెప్పవలసింది చెప్పినాను-ఆపైని తమచిత్తము, ఆమె భాగ్యము.

శ్రీద—చిత్రముగానుందీ కథ. ఇందెంత నట్టునిజము?

కమ—నరేనా మాట నమ్మకుంటే నేటిరాత్రి మీరు నందనవనమున కేగి సర్వమూ ప్రత్యక్షముగా చూడవచ్చును. అనుదినమూ ఆమె ఇట్లు చేస్తూంమనని నానమ్మకము.

శ్రీద—నాకే (స్వ) ప్రియులారా! నేటిరాత్రియే నీ దుఃఖ మంతరింపనని నమ్ము.

కమ—యువరాజా! ఏ మాలోచిస్తున్నావు?

శ్రీద—ఏమీ లేను. ఆశ్చర్యవిహ్వలుడనై యున్నాను.

(విచిత్రశర్మ వచ్చును)

కమ—విదూషకశర్మా! రండి.

విచి—సరిసరి. తపశ్చరణమునకు విశ్వామిత్రుని తమ్ములు వీరు-గడ్డములూ జడలూ పెంచిన ఋషులకే అసాధ్యమైనపని వీరిచేత నవుతుందా?...అయ్యా! ఇక్కడ నొక యోగీశ్వరు డుండవలెను, వారిని వెతకవచ్చినాను. మీరు కూడా కొంతవరకూ సన్యాసం పుచ్చుకొన్న ట్లున్నారు. ఆతడు సర్వసంగపరిన్యాసి-

శ్రీద—విచిత్రశర్మా!

విచి—ఓహో! మీరేనా! గురుతుపట్టలేకపోతిని, క్షమించండి-అయ్యా? ఈజగత్తులో అసాధ్యమైనది లేనేలేదని తీర్మానించినాను. యోగీశ్వరా! మీకూ లీలావతీదేవికిన్ని

వివాహమైనప్పుడు నేను జ్ఞాపకముందునా ?

శ్రీద—కమలాకరా ! వారందరూ మనపట్టణమునకు వచ్చియున్నారా ?

కమ—వచ్చినారు-కోట దక్షిణపార్శ్వమున వారికి విడిది ఏర్పాటు చేసినారు.

విచి—యువరాజా ! రాగులకూ విరాగులకూ, భోగులకూ, యోగులకూ వ్యత్యాసమే లేదని నేడు తెలుసుకొంటిని.

శ్రీద—అట్లుకాదు-రాగులకూ భోగులకూ వ్యత్యాసము లేదనుము-నేను "కొంచెము" ఏకాంతముగానుండగోరెదను.

విచి—ఇందులో కొంచెము మర్యాదా ? ఇక్కడినుండి పొండన్న తీరిపోవునే !

(కమలాకర విచిత్రశర్మలు పోవుదురు-ఆగదిలోనున్న తనతల్లి పటముచెంతకేగి శ్రీదత్తుడు నమస్కరించును)

---

## —• రెండో రంగము •—

---

(నందనవనమున నొకపొదరిల్లుచెంత శ్రీదత్తుడు)

శ్రీద—ఇదే కమలాకరుడు చెప్పినచోటు. ఈపొదరింటిలోని చంద్రికాప్రసారమెంత కమనీయముగా నున్నది ! (కలయజూచి) ఐనను దీనియందేదో లోపమున్నట్టు తట్టు

తూన్నది. నామిత్రి యింకనూ రాలేదేమి! ఆనారీశిరోమణివచ్చే వేళకాలేదుకాబోలు! అబ్బా! నేటిరాత్రి కడు దీర్ఘముగానున్నది.

కమలాకరుడు అసత్యము పల్కెనా? అతడట్టివాడు కాడే! నా అంతఃప్రవృత్తి యిక్కడికి వచ్చుటే నిజముకాకుంటే నామనసులోనింత సంతసమేల కల్గును? . ఇదే కుడికన్నదురు తూన్నది. నాప్రియమురాలు రావడమునకు సందేహము లేదు. ...ఆం...అదే వస్తూన్నట్లుంది...ఛీ ఛీ ..వట్టి బయలు చూచి ఆమె యనుకొన్నాను... అయ్యో! నామదికి నేను నిలకడ లేకున్నది. ఆశోకల్పకమా! నా పాపపుకనులకు నీ వెప్పుడు అగుపడుదువో? నావలపుచిలక ఇక్కడకే కదా వచ్చురెండు మూడు నాళ్ళనుండీ దురపిల్లుతూన్నది! ఆమె యాక్రందనము విని ఈచెట్లఆకులు వాడుతున్నవి-ఆమె బాష్పములను జూచి తాముకూడకన్నీరోడ్చుటచేత కాబోలు చల్లగానున్నవి! పల్లవములారా, ఆమె మీాకంటబడడము మీారుచేసుకొన్న పుణ్యము చేతనే కదా? స్ఫటికశిలాఫలకమా నీభాగ్యమే భాగ్యము. నాప్రియపాదముల సీతలముపై జాల్చగలిగితివి. ఈ యనుక చేసుకొన్నంత పుణ్యమైన నేను చేసుకొనలేదే!...ఆం...ఎవరో వస్తూన్నట్లుంది - నా మోహనాంగి కాబోలు? ... కాదు. కాదు-పూగుత్తులతోకూడిన ఈమాలతీలత కదలుట చూచి భ్రమచెందినాను...ఇంత నేపైనది-ఇంకనూ రాలేదే? కలికీ, నేను నీకుచేసిన అపకారమునకు వినిమయముగా నన్నిట్లు దుఃఖపెట్టుచున్నావా?——నాతప్పు మన్నించి వేగమే రా

కాదా?—ఆమె రాకకు నేనెంత ఆత్రపడుతున్నానో ఆమె యెరుగదు పాపము! తెలిపియున్నా నన్నింతకాలము నిలబెట్టునా? చంద్రుడు పడమింటికి వచ్చినాడు - కమలాకరుడు చెప్పినసమయము చెంతకువచ్చినది ఇప్పటికి నాభాగ్యలక్ష్మి వస్తూఉండును.-ఆమె నాకు కనిపించకున్నా నామనస్సు కేదో ఆమె శీఘ్రమే వచ్చునని బోధిస్తూంది. ఇక సందేహము లేదు. అదిగో మృదుపదముల లలితశబ్దము వినిపిస్తూంది. కొంచెముసేపు నాతమి నదిమి ఈచెట్లచాటుననుండి ఆమె చేష్టలు కనిపెట్టి ఆనందించెదను. అమ్మా, గౌరీ, ఇదంతయూ నీదయామహిమ (దాగుండును)

(సులోచన నలువైపులా చూచుకొంటూ నిశ్శబ్దముగా వచ్చును)

సులో—ఈయుద్రేకము నణముదింపవలెను. దీనివలన ఆవంతయైనా లాభము చేకూరదాయెను. ఇది కూడదని ఎరుగుదును, కాని దీనిని కప్పిపుచ్చుట సాధ్యము కాదాయెనే? అణచడానికి యత్నించినకొద్దీ అతిశయిస్తూన్నది. మాయిద్దరికీ ఎంత యంతరముంది! అతడు రాజాధిరాజు, నేను దాసానుదాసిని! నక్కెక్కడ దేవలోకమెక్కడ!—

నావృత్తాంతము బయలుపెట్టుదునా? అనర్థదాయకమైన ఆలోచన—బ్రతుకునకే ప్రతిబంధకమాయెనే! నేనేల పుట్టితిని, ఏలపెరిగితిని? గతమును గూర్చి గాసిలనేల? ప్రకృతమున నేను నీచదాసిని—నే నాయువరాజుపై వలపుగొన

చూచితిన్న, నిండువెన్నెల పూర్ణచంద్రునిపై నుగులుకొనుట చకోరము తృప్తిని గొనుచుండును. చంద్రుని మోహించినందు కాతని కరముల సంసర్గమైనా కొంతవరకు లభించిందని ఊరడిల వచ్చును. యువరాజు సంసర్గ మబ్బుటమాటా ఆతడు నన్ను కన్నెత్తియైన చూడడే! ఆభాగ్యమొక్కసారి కలిగింది. అయినా దానినిప్పుడు తలచుకొంటే మైమరపు కల్గుతూన్నది. ఆతని చేయి నాతనువుపై సోకిన సుఖమునకూ ఆనందమునకూ మేర యున్నదా? దానియొక్క సంస్మృతిచే ఇప్పటికీ తనువు పులకరిస్తూంది. ఆవాసనచేతనే ఇన్నాళ్లూ ప్రాణములు బిగబట్టియుంచగల్గితిని! ఆతని యందము, పాటవము; వచోవిన్యాసము నాహృదయ ఫలకమున సువర్ణాక్షరములు చెక్కబడి యుండడముచేత ఒక్కనిమిషమైనా మరపునకు రాకున్నవి. మరపుచొప్పుననైనా ఆతడు నన్ను తలచునో లేదో? అది తెలియకుండా నేనతని కోరడము న్యాయమా? ఇది యుక్తమా?...ఏల కాకూడదు? అతడు నన్ను పెళ్లాడకున్నా, ఆతని నెప్పుడూ త్రికరణశుద్ధిగా వరించి దైవముగా పూజించుతూన్న నేను ఆతని నేలతలపరాదు? నేనతని ధర్మపత్నినికానా? చిత్రరేఖా దేవిమొద్ద తాను వివాహము చేసుకొనడానికి సమ్మతించలేదా? ఎవతె ఈతని యర్ధాంగియై ధన్యకానున్నదో! ఆమెభాగ్యమే భాగ్యము. నాకది సమకూడునా? కుబ్జుడు కువలయేశుని కొనగోరునట్లున్నా, కుంటివాడు పట్టు తేనె నాశించినట్లుంది. ఏది యేలాగున్నా ఇదినిశ్చయము—ఆతనిప్రేమను పుచ్చుకో

వలెను, లేదా నాప్రాణము నిచ్చుకొనవలెను. ఈజన్మమున ఆతనికి నాకుసగుట అసాధ్యమైతే ఇంకొకజన్మమునందైనా నాకోరిక సఫలమయ్యేటట్లు తపముచేసెదను. ఇది దైవయత్నముపై ఆధారపడియున్నది, మనుష్యయత్నము కార్యకారికాదు... సర్వేశ్వరా! నాహృదయమును నీ వెరుగుదువు, నాసంకల్పము నీకు తెలియును. నీ సంకల్పము నెరుగ నావశముకాదు. అంత వరకూ ఈపటమే నాకు జీవాధారము, దీనిజూచియే సంతసము చెందుతూ ఉండెదను...(పటమునుగుతీసి) మోహనాంగా! నీ మోవిని ముద్దుగొన నోచనైతిని, కావున నీఛాయామాత్రముననే ముద్దిడెదను. ఆనాటి ఉదయకాలమున నాప్రియుడు యోగి వేషము విడిచి జిలుగువస్త్రములూ రాజాభరణములూ దాల్చి ఒయ్యారముగా దేవిగారిచెంతకు వచ్చినప్పుడా రాజకుమారుని చూచినప్పటినుండీ ఈపటము చూడడమునకు నామనసొప్పలేదు. దీని వ్రాసినవానికి నేర్పు లేనేలేదు. ఆ నవమన్మథుని లావణ్యమున నొకవీసమైన నిందు ప్రతిఫలింపచేయలేక పోయెనే!...ఏమది! నాయెడమభుజ మదురుతూన్నది! ఇందువల్ల నా కేదో గొప్పమేలు సమకూరునని సూచింపబడుతూన్నది. నాకోరిక ఈడేరునను ఆస పుట్టుతూఉన్నది...అది రిత్త కాదని నామనస్సునకు తట్టుతున్నది-నాప్రియుడు నాకు లభించునా? ఈయర్ధరాత్రమున నాప్రియుడు నాకంటబడుటెట్లు? కంటపడినా ఆతడు నాకులభించుటెట్లు? ఇదెల్ల వట్టిఅడియాస... మనోనాథా! నాప్రాణనాథా, ఈదాసురాలియెడ నీకు లేశమైన

జాలిలేదా? నన్నిట్లు తల్లడిల జేయుట న్యాయమా? ఒకసారి కంటబడి "నేను నిన్ను ప్రేమించుచున్నా" ఒక్కమాట అనరాదా? పోనీ ఒక్కసారి దృష్టి సారింపరాదా? అంతభాగ్యమా! పోనీ కంట పడకిలేని నాహృదయమును తలంచి నీవు పోదోసిన ప్రాణములు త్యజించియుందునే? అబ్బా! ఈ మలయమారుతవీచికలు నాపాలిటి బడబాగ్ని శిఖలుగా నున్నవి-నిండారవిరిసిన యీ పూవులు నాకా శరములవుచున్నవి. ఈ వెన్నెల కాయుచున్న చంద్రుని వలె బాధిస్తున్నది-ఈమోహాగ్నిని క్రుమ్ముతూఉన్న నాశరీరము దుర్భరమవుతూఉంది. నీవు కంటపడకున్న జీవములు నిలువవుసుమా! (మైమరచును)

(శ్రీపతి యు చెట్టుచాటుననుండి త్వరగావచ్చి ఉత్తరీయముతో వీచుతూ ప్రక్కను కూర్చుండగా లీలావతిచూచి మాన్పడి చెట్టుచాటున దాగును.)

శ్రీప—ప్రేయసీ, "నీవు నన్ను ప్రేమించినట్లే నేను నిన్ను ప్రేమిస్తూన్నాననీ" అనరాదా అంటివి. కాని ఆమాట నెట్లనగలను. నిజము చెప్పుతూన్నాను విను. నీకంటె వేయి రెట్లు అధికముగా ప్రేమిస్తూన్నాను. సంతోషము కల్గినదా?

సు...ప్రాణ—యువరాజా—మీరు--ఇచటికి—ఇపుడు ఎట్లు వచ్చినారు?

శ్రీప...ప్రాణప్రియా, నోటినిండ ప్రాణనాథా అని పిలువబోయి మానినావు—నేజేసిన పాపమేమి? నావల్ల నేరమేమి?—నీవెరుగని దేమున్నది? ఎందుకు వచ్చితివని అడుగ

వలెను, లేనా నాప్రాణము విచ్చుకోవలెను . . ఈజన్మమున ఆతనికి నహిసగుట అసాధ్యమైతే ఇంకోజన్మమందైనా నాకోరిక సఫలమయ్యేటట్లు తపముచేసెదను. ఇది దైవయత్నముపై ఆధారపడియుంది, మనుష్యయత్నము కార్యకారికాదు . . . సర్వేశ్వరా ! నాహృదయమును నీ వెరుగుదువు, నాసంకల్పము నీకు తెలునును. నీ సంకల్పము నెరుగ నావశముకాదు. . . అంత వరకూ ఈపటమే నాకు జీవాధారము, దీనిజూచియే సంతసము చెందుతూ ఉండెదను. . .(పటమునుతీసి) మోహనాంగా ! నీ మోవిని ముద్దుగొన నోచనైతిని, కావున నీఛాయాధరమునసే ముద్దిగొను. ఆనాటి నాయకాలమున నాప్రియుడు యోగి వేషమువిడిచి జిగువస్త్రములూ రాజాభరణములూ దాల్చి ఒయ్యారముగా దేవిగారిచెంతకు వచ్చునప్పుడా రాజకుమారుని చూచినప్పటినుండీ ఈపటము చూడడమునకు నామన సొప్పలేదు. దీని వ్రాసినవానికి నేర్పు లేనేలేదు. ఆ నవమన్మథుని లావణ్యమున నొకవీసమైన నింపు ప్రతిఫలింపచేయలేక పోయెనే! . . . ఏమది ! నాయెడమభుజ మదురుతూన్నది! ఇందువల్ల నా కేదో గొప్పమేలు సమకూరునని సూచింపబడుతూన్నది. నాకోరిక ఈడేరునను ఆస పుట్టుతూఉన్నది . . . అది రిత్తకాదని నామనస్సునకు తట్టుతున్నది-నాప్రియుడు నాకు లభించునా? ఈయర్ధరాత్రమున నాప్రియుడు నాకంటబడు టెట్లు? కంటపడినా ఆతడు నాకులభించు టెట్లు? ఇదెల్ల వట్టిఅడియాస . . . మనోనాథా! నాప్రాణనాథా, ఈదాసు రాలియెడ నీకు లేశమైన

జాలిలేదా? నన్నిట్లు తల్లడిల జేయుట న్యాయమా? ఒకసారి కంటబడి "నేను నిన్ను ప్రేమింతునని" ఒక్కమాట అనగాదా? పోనీ ఒక్కటియు దృష్టి పడరాదా?..అంతభాగ్యమా! పోనీ కంట పడితివేని నా వ్యాకులము నెఱిగించి నీవు పోదోసిన ప్రాణములు త్యజించియుందునే? అబ్బా! ఈ మలయమారుతవీచికలు నాపాలికి బడబాగ్నిశిఖలుగా నున్నవి-నిండారబూచిన యీ పూవులు విషాగ్రశరములయ్యెనే! ఈవెన్నెల కాగుచున్న సీసమువలె బాధిస్తూన్నది-ఈమోహాగ్నిని మగ్గుతూఉన్న నాశరీరము దుర్భరమవుతూఉంది. నీవు కంటపడకున్న జీవములు నిలువవుసుమా! (మైమరచును)

(శ్రీదత్తుడు చెట్టుచాటుననుండి త్వరగావచ్చి ఉత్తరీయముతో వీచుతూ ప్రక్కను కూర్చుండగా లీలావతిచూచి మాన్పడి చెట్టుచాటున దాగును.)

శ్రీద—ప్రేయసీ, "నీవు నన్ను ప్రేమించినట్లే నేను నిన్ను ప్రేమిస్తూన్నానని" అనరాదా అంటివి. కాని ఆమాట నెట్లనగలను. నిజము చెప్తూన్నాను విను. నీకంటె వేయి రెట్లు అధికముగా ప్రేమిస్తూన్నాను. సంతసము కల్గినదా?

సులో...ప్రాణ—యువరాజా—మీరు--ఇచటికి—ఇపుడు ఎట్లు వచ్చినారు?

శ్రీద...ప్రాణప్రియా, నోటినిండ ప్రాణనాథా అని పిలువబోయి మానినావు—నేజేసిన పాపమేమి? నావల్ల నేరమేమి?—నీవెరుగనిదేమున్నది? ఎందుకు వచ్చితివని అడుగ

వలెనా? ఇంతవఱకెందుకు రాలేదని శాసించుటతగవు. కాని రెండు మూడు నాళ్లనుండి నేను పొందుతూన్న ఆ పాటును నీవెఱిగియుంటే ఈ మాట అడిగేయుండవు. మనోహారిణీ, నిన్ను పూదోటలో చూచినప్పటినుంచీ నాకంటికి రెప్పపాటు లేదు.

సులో... నేను మిమ్ము ధ్యానిస్తూ దుఃఖించినట్లు మీరు నన్నుతలచి దుఃఖించియుండరని నానమ్మకము.

శ్రీధ... నాబహిఃప్రాణమా! నీవూతే కానీ-గతమును స్మరించి దుఃఖము చేయనేల? ఆ బాధ పరమశత్రువునకైనా వద్దు. ఎండలో క్రుమ్మరి పల్లటిల్లినవారికే నీడసుఖము తెలియగలదు. తలిరాకులబోలు నీపదపల్లవములను బాధించెద వేల?......... ..నా మనస్సు తల్లడ మొందుతూన్నది. ఈ స్ఫటికశిలా వేదికపై నీయలపాటుచొప్పున నించుక విశ్రమించి వాటిశ్రమ నపనయించుము.

సులో... అది నేననవలసిన మాట.

శ్రీధ... సరే-మనమిద్దరమూ విశ్రమింతాము రమ్ము. (కూర్చుందురు)

మోహనశుకమా! కల్పకమహీరుహమా! నీప్రేమ జూరగొన్న నాభాగ్య మెంతనివర్ణింతును! ఇతరులకది దుష్ప్రాప్యమునుమా! తాను మనసార ప్రేమించిన కాంతామణి తనను మనసార ప్రేమిస్తే, అట్టివాఁ డిహమున పొందగలిగిన దిక లేదనుమా! మానినీమణీ! ఏమాలోచిస్తున్నావు?

సులో...ఏమీలేదు.

శ్రీద...ఇంతలోనే దాపరికమా? నాతో చెప్పరాదా?

సులో...మీవద్ద దాపరికము నాకుండునా? మీరు రాజాధిరాజులు—నేను మీ జానానుదాసిని—అట్లుండి యూ నేను మిమ్ము ప్రేమించడమునకు తగినదాననా అని యోచిస్తూన్నాను.

శ్రీద...ముద్దరాలా, ఇదా నీసంశయము! నిసర్గ ప్రేమస్వభావము నీవెరుగవు. దానికి ప్రభువనీ, దాసిఅనీ భేదములేదు. నీవు దాసివైననేమి? నామనమెప్పుడు నీయందు లగ్నమైందో అప్పుడే నీవు నాకంటికి లోకములోనివారి యందరికన్నా ఎక్కువదానవైనావు. ఇంగల యోండకత్తెలనెల్ల నొకకడ నిన్నొకకడనుంచి దైవము నన్నెంచుకొమ్మని ఆజ్ఞాపిస్తే నేను మహాప్రసాదముని నిన్నే గైకొందును. జన్మముచేత నీవు దాసివైతివి, కాని గుణముచేత కులీనుల మించినావు. కులము ప్రధానమా గుణము ప్రధానమా?

సులో...ఎన్నివిధముల సరిపుచ్చుకొన్నా మీకు నేను తగినదానను కానగుట నిశ్చయము.

శ్రీద...కాంతామణీ! నీవు నాప్రేమకు పాత్రము కావా? నీయోగ్యత నీవెరుగవు. నీవంటి నిసర్గప్రేమసి ఈ లోకమున నుండుటకుదు. నిన్ను చూచినంతనే నాకు నిరతిశయానందము కలుగుతూంది. నీమధురవచోమృతము వీనులార గ్రోలుతూఉంటే నామనస్సు పరవశమవుతూన్నది. నీ

శరీరము తాకుటవల్ల కలిగిన ఆనంద మనంతుడే వర్ణించవలెను. స్వర్గమంగలి అమృతమొక ఇంద్రియమునకే సుఖమొనగూర్చ కలదుగాని, నీవు పంచేంద్రియముల కొక్కసారి నిస్తులానందము కల్గజేస్తూన్నావు. ఈసౌఖ్యము నాకితరాంగనలవల్ల కలుగుట అసంభవము, అసంభావ్యము.

ఇట్టి లోకోత్తరానందదాయిని ప్రేమకు ఏకలక్ష్యమగుటకు నే నర్హుడనా కానా అని సంశయిస్తూన్నాను. సిరి తన్ను వరించుట గొప్ప కాదా! సిరిని వరించని నిర్భాగ్యుడుండునా?

సులో—ఎంతమాటాడితిరి! నన్ను చూచినప్పుడు మీ కానందము కలుగుతూంది కాని మిమ్ము తలచుకొంటేనే నా మనసు నిస్తులానందముచేత పరవశ మవుతుంది. కాని ప్రాణనాథా! నాబోటి కాంతల నేకులు భువనమోహనులు, సత్కులీనులు, రాజాధిరాజులూ అగు మిమ్ము ప్రేమింతురు. మీరు నాయెడ ననురక్తులగుట నా పూర్వభవపుణ్యమని భావింతును.

శ్రీద—మనఃకాంతా! నీ వాలాగనుట ధర్మము కాదు. ఒరులు నన్ను ప్రేమించుతారనుట భావ్యమైనా దానికి నే నుత్తరవాదిని కాను. నే నింకొక వనితను ప్రేమించడము మాత్రము కల్ల. సూర్యు డపరాద్రి నుదయించవచ్చును. అగ్ని చల్లబడవచ్చును, కాని నిన్ను త్రికరణశుద్ధిగా వరించిన నేను ఇతరస్త్రీలను మోహాదృష్టుల తిలకింతు. ననుమాట

సర్వాబద్ధము. నామనస్సును పరిశోధించడముకే కిట్లంటున్నావో లోకాచారము ననుసరించి అంటున్నావో నాకు తెలియదు! కాని ఈ విషయమును నీవు లేశమైనా సందేహపడవద్దు. మోహముచే మతిచెడి అన్నమాట కాదిది. ఈ జన్మమున కానీ, ఇంకొక జన్మమున కానీ నిన్నుగాక ఇతరులను వివాహ మాడినా, లేక మోహించినా నాతల్లికి నేను ద్రోహము చేసిన వాడ నౌదును.

సుశీ— ప్రాణేశ్వరా! ఎంతప్రమాణము చేసితిరి! మన పదవులలోనున్న తారతమ్యముబట్టి శంకించి మీమనస్సును శోధింపబూనితిని గాని మీ ప్రేమగభీరత నే నెరుగక కాదు. మీ రిప్పుడు చేసిన ప్రమాణమునకు బదులు నే నొసర్పలేను. కాని ఇది వినండి. ఈ పుట్టువునకాని ఇంకో పుట్టువునకాని నాకిప్పుడు మీపై కుదిరిన ప్రేమానురాగము ఏమాత్రము తగ్గినా శాశ్వత ఘోరనరకము పాలవుదును. వెయ్యి జన్మము లకూ మీతోటి సంసృతియే వరముగా బడయ అఖండమైన తపమొనర్చెదను. ఇది నామనోనిశ్చయము; నాకొక సంశ యము కల్గుతూన్నది. ఎన్ని జన్మాలకైనా నన్ను మీ రెడ బాయకుందురా?

శ్రీద— బేలా! నాప్రేమగభీరత నీ వెరుగనేరవు. నీయెడనా కనురాగ ముదయించడము నీరూపగుణములజూచి కానేకాదు. అటులైనచో నది మోహ మనజెల్లును. మన కిద్దరికీ అవినాభావము సిద్ధించడానికి కదిచాలును. నేను కోరేది

నీకా నైక్యత నెందుకే. నిన్నేతుదాయాస జూచితినో అప్పుడే మనఆత్మ లొకమైనవి. ద్వైత మీ శరీరములయందు మాత్రమే కల్గియుండె. ఐక్యతచెందిన మన ఆత్మల విడదీయుటకు బ్రహ్మకైన వశము కాదు. ఎన్నిజన్మలనైనా మనకు వియోగము ప్రాప్తించబోదు. నీ కాసంశయ మెుండ నవసరము లేదు.

సులో—నాథా! నిజముగా నేనిప్పుడు నిరతిశయానంద మగ్నురాల నైతిని. ఇం కేసందేహమూ నా కేల? పతిప్రేమ నంతా జూరగొన్న నాబోటిభాగ్యశాలిని ఇంకొక తెఉండదు. ప్రాణకాంతా, ఇప్పటికే జాలముగాయెను. మీరు రాజభవనమునకు పోవలెనేమో? నా కేమీ తొందరలేదు. ఇక్లే రేయెల్ల గడిచిపోవలెనని నాకోరిక. అయినా—

శ్రీద—నీమాట నిజమే కాని కొంచెము సేపు ఈ వనము చుట్టూ తిరిగి తరువాత మనమిద్దరమూ పోవచ్చును.

సులో—భాగ్యము! అట్లే చేతాము. ప్రాణేశ్వరా, మనసుఖము చూచి ఈ పూలచెట్లన్నీ సంతోషిస్తూన్నట్లున్నవి.

శ్రీ—సుందరీ, మన మన్యోన్యమూ ప్రేమగొనియున్నామను సంగతి బయలుపడనీకూడ దనడాని కొక కారణముంది. అందుచేత నేను చెప్పువరకు నీవు దీనిని వెలిబుచ్చకు.

సులో—మీమాట జవదాటను.

శ్రీద...నీయందలి నాప్రేమ కొనసాగుటకు ఇదిగో నీ

వేలున ఉంగర ముంచుతూన్నాను. దీనిని నీవు నావలెనే చూచుకొంటూ ఎప్పుడూ ఎడబాయకు. ఇదే హెచ్చరిక-ఇంకా కొంత కాలము దీనిని గుప్తముగా నుంచుకొనుచుండుము. (ఉంగరము వేలినుంచుతూన్నాడు.)

సులో—చంద్రునకు నూలుపోగన్నట్లు నాప్రేమ కానవాలుగా దీనిని మీరు ధరించండి. (తనయుంగర మిచ్చును)

శ్రీక—ప్రేయసీ-ఈ గులాబిపువ్వు ఎంత కమనీయముగా నుందో కంటివా?

సులో—మీ చేతినున్న దేనికి మనోహరత అబ్బదు?

శ్రీక—సరే-దీని నీకొసగెదను-నీవు నాకేమిచ్చెదవు?

సులో—నేనే మీదానను. ఏది కావలెనన్న దానిని చ్చెదను.

శ్రీక—నాకు లోకమంతటికన్న ఎక్కువ యింపును గూర్చేదాని నిచ్చినట్లైతే ఈపువ్వు నీకిచ్చెదను.

సులో—మీది మీకిచ్చుటకు నేనెవ్వతెను? మీరే కొనవచ్చును-నా అభ్యంతర మేమంతైనా లేదు-

శ్రీక—బలే, నీబుద్ధికి సంతసించినాను. (గులాబిపువ్వు ముద్దుబెట్టుకొని ఆమెకొసగును)

సులో—నాకు వల దాపువ్వుము-

శ్రీక—తెలిసింది-ఇంతలో నేస్పర్ధా? వెర్రిదానా, దీనిని నీకివ్వబోవునప్పుడు ముద్దుగొనడము నిన్ను ముద్దుబెట్టుకొన్నట్లే అగును. నీ శ్వాసం దేహమే ఉన్న యెడల నిన్ను

కూడ యిప్పుడే ముద్దుపెట్టుకొందునుచూడుము.

సులో—మగవారు గడుసువారు-సమాధానమిచ్చి సతుల వశపరుచుకోవడము వాళ్లకు వెన్నతో బెట్టినది.

శ్రీద—ఇదే రాజభవనము దరికివచ్చినాము. ఇంక మనము కలిసియుండరాదు-ఎవరికంటనైనా పడుదుము.

సులో—తిరిగీ మీరెప్పుడు నాకంట బడడము ?

శ్రీద— రేపుదయము ఐదుగడియలకు నేను నిన్ను చూడవచ్చెదను.

సులో—సెలవు...(ఇద్దరూ పోవుదురు.)

లీలా—(పొదరింటినుండి బైటవచ్చి) నే నిప్పుడుకన్నది కలా ? భ్రాంతియా ?...కాదు, కాదు...ఆహా ? దంతవక్రుడూ దుర్మతీ ఇంకా బ్రతికియున్నారు...ఏమి ఆశ్చర్యము ! నేనొకటి తలచిన దైవమొనర్చిందన్యమైందే !...ఇం దాశ్చర్యమేమి ? ఇహసౌఖ్యమును పరిత్యజించిన శ్రీదత్త రాజకుమారుని మైమరపించి మోహవాగురులలో చిక్కించుకొనగల్గిన ఈ రండ దొంగలను ఏమార్చి వాళ్లకళ్లలో దుమ్ము జల్లడము వింతా ? అబ్బా ! సులోచనా ! నీవింతదిట్టవని నే ననుకోలేదు. నీచాకచక్య మవగతమైంది...ఇది రూపుమాసినదని తలచి శ్రీదత్తుని పెండ్లియాడ నే నిక్కడికి వచ్చుటేమి ? ఇక్కడ సులోచనా శ్రీదత్తులు ఒకరికౌగిళ్ళ నొకరు సుఖముగా ముద్దులాడుకొను టేమి ? అది చూచిన నాకు కలిగిన కంటకికి కలికము వేసినట్లుంది- నామన స్సెంత

తల్లడమందింది! వారాడుకొన్న ఒక్కొక్కమాట నాచెవికి నారాచములాగున తగిలింది! వారొకరి నొకరు ముద్దుబెట్టు కొనపోవునప్పుడు నాయొడలు రంపముతో కోసినట్లయింది!... ఏమి ముద్దులు! ఏమి సుద్దులు!...చీచీ...సులోచనా, ఎంత సిగ్గుమాలితివే! నిన్నాత డీజన్మమున పెళ్ళియాడడము చాల దేమి? వేయిజన్మముల కాతడేమగడు కావలెనేమి? ఏమి నీ పేరాస! ఈజన్మమునకైనా నీ కాతడు చిక్కునని సంతసిస్తూ న్నావేమి? నేను లీలావతి నవడము నిజమైతే, ఇంక రెండు మూడు దినములలో మీయిద్దరినీ విడదీసి నీవు జీవించి యుండగా నీప్రియుని నేను పెళ్ళాడెదను చూడు. ఆతడిప్పుడు నీయెదుట కావించిన ప్రేమ విడంబనము నిజమైనప్రేమానురా గముగాభావించి ఆతనినే మెడకు కట్టుకొందునని కులుకబోకు- నాముందర నీటక్కులు తీసిపెట్టు. నన్నింకా యువరాజుచూడ నేలేదు - నాపరిచయమొక్కసారి కల్గినట్టైతే నీపైవర్షించిన ఆతని ప్రేమాసారమంతా హరించిపోవును సుమా! ఇదిగో నీకతడిచ్చిన గులాబిపువ్వు! (దాని తొక్కును)

దీనిని హూపుమాపినలాగు నిన్నుకూడా నాశనము చేయకుంటే నాపేరు లీలావతి కాదని నమ్ము. ఆతని ఒళ్ళో నున్నప్పుడే నిన్నంత మొందించవలసింది, కాని ఆతని మొగము చూచి నిన్ను పేక్షించినాను....ఆనవమోహనాకారుని గూడి సుఖంపదగినదానవు నీవా? అంతభాగ్యము నీకబ్బునా?...ఆహా!

ఇతనివంటి రూపలావణ్యవంతునే గనలేను. ఇకముందు గన బోవుటనననడనూ అసంభవమే....అట్టి అందకానికి తగిన దానను నేను. నాయందచందములే ఆతని సౌందర్యమునకు తగినవి. ఇతనిగూడి సుఖింపని స్త్రీజన్మము నిష్ఫలము.... అట్టిసాగను కాదు ఆ కులటనుకూడ నప్పుడామె కులుకు చూచి నాచిత్తమెంత తత్తరపడింది. ... సులోచనా! చిన్న ప్పుడు నీవు నన్ను చేరబిలిచి "అక్కా, నీవూ నేనూ ఒకటే, నీ మంచిచెడ్డలు నావి, నా మంచిచెడ్డలు నీవి" అని చెప్పితివి-అది యీనాడు నాకనుభవసిద్ధ మయింది. యువరాజు నిన్నిందాక ముద్దుగొనబోవునప్పుడు నామేనెల్ల పులకరించింది.నీమైమరపు నాకు సంధిల్లింది....కాని,అయ్యో! నాసౌఖ్యమునకు నీవేల అడ్డుపడ్డావు? నాపనిలో నాకు ప్రతి కూలించిన వాళ్ళెవరినీ నేను జీవింప నియ్యలేదే! నల్లివంటి దానవు నీవు నలగకుందువా? సరే...నాపని నేను చూచు కోవలెను....సులోచన ఇక్కడకేలాగు రాగల్గింది? ఇక్కడ వారాడిన మాటలబట్టి యువరాజు కీమె సులోచన అని తెలిసినట్లు తోచదు. ఆమె నిజముగా దాసి అనే అతడు భావిస్తూన్నాడు. ఏకాంతమున కూడా సులోచన నిజము చెప్పక పోవడానికి హేతువేమి? దీనికేదో కారణముండి తీరును. ఈమె యుదంతము మాజననీజనకు లెరిగిరా నాయత్నమంతా నిష్ఫలమవును.... దీనికే మెత్తెత్తవలెను?... సులోచనను చంపనా? నేను తలచుకొంటే దానికి నిమిషము పట్టదు....

కాని తోఁబుట్టువు కావడముచేత కాబోలు దీనిని చంపడానికి నామనస్సొప్పకున్నది...దీని నిటనుండి పారతోలవలెను.... ఇందుకేమి ఉపాయము కద్దు?...నాకీసంకటావస్థయందేదీ స్ఫురించలేదు. (ప్రతాపశీలుడు వచ్చును)

ప్రతా—లీలావతీ!

లీలా—రాకుమారా!

ప్రతా—నీవిక్కడికేల వచ్చితివి?

లీలా—మీరిక్కడికేల వచ్చితిరి?

ప్రతా—నా రాకకు కారణము చెప్పనా?

లీలా—చెప్పండి.

ప్రతా—సుందరీ, నిన్ను గాంచినది మొదలు విరహానలమందు వేగుచున్నాను. మచ్చలేని నీ సౌందర్యచంద్రికను మెచ్చి మోహావేశుడనైతిని. అప్పటినుండీ నాచిత్తము నీయందు జొత్తిల్లుచుండుటచేత ఈరాత్రి కూర్కులేక ఈప్రమదావనమున నించుక విహరిస్తే తాపముతగ్గి నిద్రవచ్చుననే ఆశచేత ఈచోటికి వచ్చినాను. నాఅదృష్టవశమున నీవు ప్రత్యక్షమైనావు. నారీమణీ, నాప్రాణములు నీచేతిలోనున్నవి. నాపైకృపవహించి నాజీవములను నిల్ప వేడుకొంటున్నాను.

లీలా—నేను యువరాజును పెండ్లియాడ బోవుచున్నానని తెలిసీ మీరిట్లు పలకడము తగునా?

ప్రతా—ఆవిషయమునసే నీతో ప్రసంగింప వచ్చినాను. యువరాజుతోటి నీకు వివాహము కాజాలదు. అతడు నిన్ను

పెళ్లాడనని ప్రమాణముచేసినాడు. ఈ రహస్యము నాకు తెలిసి నీతో చెప్పవచ్చితిని రేపు మహారాజుగారికి నిండుకొలువులో తెలియగలదు....ఒకవేళ అదే నిశ్చయమయ్యెనా, నీవు నాపై ప్రేమ జూపెదవా?

లీలా—మాతలిదండ్రుల సంకల్పము సాంతము కానీ-నేనిప్పుడేదీ నిశ్చయించజాలను....మీరు నామీదనే నిజమైన ఆశ పెట్టుకొని యుండడము నిశ్చయమా?

ప్రతా—యువతీ వతంసమా, లేనిపోని శంకలేల పెట్టు కొందువు? నీవు కాలితో నిచ్చుదానిని నేను చేతులతో స్వీకరించడానికి సిద్ధపడియున్నానని నమ్ము. కావలెనన్న నన్ను పరిశోధించి చూడు.

లీలా—సరే...రాకుమారా, మనకిక్కడ సమావేశమయిందని ఇతరులెవ్వరూ ఎరుగకూడదు-రేపు మీమానసమును నేను పరీక్షింతును. అందు మీరు ఉత్తీర్ణులైతిరా, ఆవెన్క నన్నీ చక్కబడును.

ప్రతా—సరే-నీచిత్తము....(పోవును)

లీలా—ఇది కొంత మేలే! వీనిని సాధనముగా చేసి కార్యసిద్ధి గాంచెదను....ఇతడిందుకు యోగ్యుడే! ప్రతిభావంతులకు గర్షిపరకయూ ప్రబలాయుధమగును కాదా?...ఈతని మాటలు నిజమవునా? తినబోతూ రుచి యడుగనేల?

—• మూడో రంగము •—

వాసవదత్తుని దర్బారులో సంగీత మంటపము-

(చిత్రరేఖ, కాంతిమతి,లీలావతిన్నీ విలాసార్థము పాడుకొంటు న్నారు. పద్మాక్షి ఊరక కూర్చున్నది.)

(వాసవదత్తుడు పరాక్రమకేతూ వచ్చినారు.)

వాస—ప్రేయసీ, నేటికెన్మిదవనాడు వివాహముహూర్తమున్నదని పురోహితుడు చెప్పినాడు. కావున ఆనాడు శ్రీదత్తునికీ లీలావతికీ వివాహము చేయడానికి నిశ్చయించినాము ని నీతో చెప్పవచ్చితిని.

చిత్ర—చాలా సంతోషము-అట్లేచేయండి,అభ్యంతరమేమి?

పద్మా—యువరాజీ వివాహము తనకు సమ్మతమని చెప్పెనా?

వాస—ప్రియా, దీనికాతడు సమ్మతించెనని చెప్పితివే.

చిత్ర—ఔను-నేనడిగినప్పు డొప్పుకొన్నాడు. ఇప్పుడీ చర్చయెందుకు?పిలిపించి అడిగితే సులభముగా ఎరుగవచ్చును.

వాస—ఎవరక్కడ? (దాసివచ్చును) గుణసేనుని వద్దకు పోయి శ్రీదత్తుని శీఘ్రముగా పిల్చుకొని రమ్మను. (అది పోవును.) లీలావతీ, మీరందరూ ఇక్కడే ఉండవచ్చును.

లీలా—(మల్లికతో) ఇదే సమయము పద్మావతితో మాటలాడి చూడు. (మల్లిక పద్మాక్షితో మాటలాడ బోవును)

వాస—లీలావతీ, నీకీవివాహము సమ్మతమేకదా?

లీలా—మహారాజా, నాతలిదండ్రుల కేది యిష్టమో నాకూ అదే యిష్టము.

వాస—బాగాచెప్పితివి-సత్కన్యకదే లక్షణము.

(శ్రీగత్తుడు, గుణసేనుడూ వత్తురు-ఆవెనుక-దాసి ప్రతాప శీలుడూ వత్తురు-శ్రీదత్తుడు వాసవదత్తునికి నమస్కరించును.)

వాస—శ్రీదత్తా, వీరే నీకు మామగారు కాబోవుచున్నారు.

శ్రీద—నన్ను పిలువనంపిన హేతువేమి?

వాస—నీవు వివాహము చేసికొందువని చిత్రరేఖతో చెప్పితివట, నిజమేనా?

శ్రీద—ఆహా, నిజము.

లీలా—(స్వ) డెందమా తొందరపడకు.

వాస—నీమనో నిశ్చయమునకు సంతసించినాను. ఇదిగో పరాక్రమకేతుగారి పెద్దకుమార్తె లీలావతిని నీకు వివాహము చేయనిశ్చయించినాము. ఆసంగతి నీకు చెప్పుటకే పిలిపించితిని.

శ్రీద—అయ్యా, నేను వివాహము చేసుకొందునని మాత్రమే బాసచేసితిని, కాని పరాక్రమకేతుగారి కూతురిని వివాహమాడుతా నని చెప్పలేదే?

వాస—ఏమంటివి?

శ్రీద—అయ్యా, నేను వివాహము చేసుకొందును, అందూ నేను ప్రేమించిన యువతీమణిని పెండ్లియాడెదను.

వేరొకతె నంకర ... స్త్రీ చూడను. నాయమ్మాటికే ఇది నిజము-మీరు నన్ను నిర్బంధించడము న్యాయముకాదు.

వాస— ఔరా! నాకవమానము కలుగ జేయడము నీకు న్యాయమా? తలిదండ్రులు సమకూర్చిన సతీమణిని పెండ్లియాడుట నీకు విధికాదా? పెళ్ళిచేసిన దానిని నీవు ప్రేమించుట సనాతన ధర్మముకాని ప్రేమించినదానిని పెండ్లియాడుట ఆర్య ధర్మము కాదే. నన్ను ధిక్కరించి ఎవర్తెనో కులహీనను పొందుతువా?...నీవెవరిని మోహించితివి? అది ప్రేమయగునా?

శ్రీధ— ఈవిషయమున నిక చర్చవద్దు-మీరు వ్యర్థము గానాపై కోపించకండి. నామనోనిశ్చయము మీకెరిగించితిని-ఆపైని మీయిష్టము. గుణసేనా! నేనప్పుడే చెప్పలేదా? జనకా, మీరు తొందరపడవద్దు-ఈ సంబంధమున మీతో కొన్ని విషయములు మాటలాడ వలెను. ఇప్పుడు నాకు సెలవిండు...

(పోవును)

వాస—చిత్రరేఖా, వానిమాటలు విన్నావా? కానిమ్ము. వీడు గర్వమును పిడివాదమును అణచుకొని, నా కాళ్లమీద పడి లీలావతినే వివాహము చేసుకొనేటట్లు చేసెదను-నాపట్టుదల వీనికేమి తెలియును?

పరా—మహారాజా! అతని కిష్టములేనిక న్నె నాతని మెడకు చుట్టుటవల్ల లాభమేమి? మాకు సెలవిండు-మేమిప్పుడే మానగరమునకు పయన మయ్యెదము. యువరాజు మనో నిశ్చయ మెరిగిన తరువాత మీరు మాకు వ్రాయు నవసరమే యుండదు.

వాస—అయ్యా-మీరించుక శాంతించండి-నా యిష్టము చొప్పున వాడు నడుచుకోవలెనా? లేక, వాని యిష్టము ప్రకారము మేము వ్యవహరించవలెనా? మీకు మాటిచ్చి, మిమ్మందరినీ రప్పించిన పిదప వివాహము జరుగకుండా మిమ్మ పోనిస్తే, నా కవమానము కాదా? శ్రీదత్తుని తిక్క తిప్పే మార్గము నాకు తెలుసును-మీ రించుక తాళితే నే నన్నీ చక్క జేసెదను. ప్రాణేశ్వరీ, వీరి నందరినీ తీసుకొని నీ వటుపొమ్మ.

(వెళ్ళుదురు)

(పద్మాక్షియు దాసియు నుందురు)

పద్మా—(వాసవదత్తునికి (మొక్కి) అయ్యా, నా దొక మనవి-మీరు తమ్మునిపై వ్యర్థముగా కోపగించకండి-వాని కిష్టములేనప్పుడు లీలావతిని కట్టిపెట్టడము మీకు న్యాయము కాదు-పరాక్రమకేతు రెండవకూతురు సులోచనను యువరాజు చూచినట్టైతే ఆమెను తప్పక వివాహమాడి తీరును: ఆమెయెక్కడికో లేచిపోయిం దన్న మాట నేను నమ్మను-ఎవరో పాపాత్ము లామెకు చెడుగు చేయనెంచి ఆమె నపహరించి యుందురని నా నమ్మకము. ఆమె నెట్లైన వెదకి రప్పించి యువరాజుకు పెళ్ళిచేసి నట్టైతే మీ యిద్దరి మాటా చెల్లుబడి యౌతుంది.

వాస—పద్మాక్షీ, అది కాదు-శ్రీదత్తుని గర్వ మడచవలెను-నీ కేమీ తెలియదు.




# నాలుగో అంకము

## మొదటిరంగము

(రాజభవనములో ఏకాంత సదనమున సులోచన మల్లికా మాట్లాడుచుందురు)

మల్లి—సులోచనా, నీ మేలుగోరి నీకేదీ చెడుగు రాక ముందే నీతో నన్ని విషయములూ చెప్పవచ్చినాను. సకాలమున నీవు నాకంట పడడము మంచిదే అయింది-నిన్నింకెవరు చూచినా నీకు కీడు మూడియుండును. చోరనాయకునితో నీవు లేచి పోయినావని యెంచి కనబడ్డచోటనే నిన్ను కాలు నింటికి పంపవలసిందని కట్టడ మీతండ్రిగారు చేసినారు. నీ యిక్కడ యెరిగించినవారికి నిన్ను చంపి వచ్చినవారికిన్ని పది వేల వరహాలిత్తునని చాటించుటచేత మనదేశమందలి ఆడవారూ మగవారూ ధనలుబ్ధులై నిన్ను వెదకుతూన్నారు. నీయందలి అభిమానముచేతనూ లీలావతి యందలి అనురాగము చేతనూ, నేను ధనాశ విడిచినాను, ఇంకొకరైతే యిప్పుడే నిన్ను బయటబెట్టి యుందురు.

సులో—మల్లికా, నానైజము నాన్నగారెఱిగి ఇట్లు ఉత్తరువు చేయడము నా దౌర్భాగ్యమే-నే నానాటిరాత్రి—

మల్లి—ఇప్పు డేమన్నా లాభములేదు-నీవు దుశ్శీల వైతివని నీతండ్రిగారు దృఢముగా నమ్మినారు. నీ వెన్ని చెప్పి నా వినేటట్లు లేదు. నీపేరు విన్నతోడనే భగ్గున మండిపడు తూన్నారు. కోపావేశమున నున్నవారికి న్యాయాన్యాయము లెరుకపడవు-అదేకాక ఆతని యెదుటపడి చెప్ప సాహసించే వారేరీ? నీవృత్తాంతము నాకు చెప్పితివి, కాని దీని నెవ్వరూ నమ్మజాలరు.... కావున ఇక్కడ నీవుంటే అనుక్షణమూ గండమే కదా? వీటినన్నిటినీ ఎట్లు తప్పించుకొందువో ఆలోచించుకో, నాపని నేను నెరవేర్చినాను. ఇక నీప్రాణ ములు నీవే కాపాడుకో (పోవుట కుద్యుక్తయగును.)

సులో—మల్లికా! మల్లికా! పోకు! పోకు! ఈ సంకటావస్థయందు నే నేమిచేయగలను? నా కింతలోనే మరణ మాసన్నమైనదని విన్నతోడనే ఉన్నమతికూడా పోయింది! నా ప్రాణములు రక్షించుకొనే ఉపాయ ముపదేశించి పుణ్యము కట్టుకోవా?

మల్లి—ఇక్కడనుంటే నీవు బ్రతుకుతెరువు నాకు కానరాలేదు-కావున నీ వీక్షణమే ఈయూరు వదలి పోతివా అటనుండి సరుకుకొని రావచ్చును. రాజుగారీయూరు రావ డముచేత నీకొంప మునిగింది, పారిపోక తప్పదు. అతని పరి వారము ఊరెల్ల తిరిగి వెదకుతూన్నారు. వాళ్ళకంట బడక

నిజ తప్పగదు. సగళులంతో కుండా చాలికత్తెలు తిరుగుతూన్నారు. వారెవ్వరైన కినుకగా నప్ప నీతనము కాదు-చేయికాలినవెన్క- ఆకులు పట్టుకొన్న లాభ మేమి ?

సులో—అయ్యో! శూయూను పసలి కానెటుపోగల ను ?...మల్లికా, మా వాళ్ళం రీయూ కెటువచ్చినారు ?

(లీలావతి వచ్చును)

లీలా—హా ! సులోచనా !

మల్లి— శ్ శ్ - కేకలు వేయకండి.

సులో—(లీలావతిని కౌగిలించి) అక్కా! అక్కా!

లీలా—సులోచనా ! నీ విక్కడికి కెట్లు చేరితివి ? అయ్యో ! ఇంకెవ్వరైనా నిన్ను చూస్తే నీప్రాణము లుండక పోవును....మల్లికా ! తండ్రిగారి దిక్కానన్న సొమ్ము నీకు నే నిస్తాను. సులోచన యిక్కడుండని ఎవరితోనూ చెప్పకు- నీమేలు మరువను-ఇదే నీపదము లంటి ప్రమాణము చేస్తు న్నాను. మాయిద్దరి ప్రాణములూ కాపాడినదాన వగుదువు-

మల్లి—అమ్మా, సొత్తు కాశపడితే యీపాటి సులో చన జీవించియే యుండదు-మీఅన్నమును తిని మీకు ద్రోహము చేసేటంత దుర్మార్గురాలను కాను.

లీలా—చెల్లీ-నీవు మాయిద్దరికంటా పడడము నీ పూర్వజన్మసుకృతమే. ఇం కెవరికంటపడినా నీప్రాణములు దక్కవు. నీవు గతించినవెన్క నేను జీవించగలనా ? నీ వే మైతివో అను బెంగచేత ఆహారమును నిద్రలేక చిక్కి సగమై

నాను. నీయెడ తండ్రిగారు చేసిన ఘోరమైనఆజ్ఞ నీవెరుగ నట్లుంది.

సులో—నాకు లోగడ తెలియదు-ఇప్పుడే మల్లిక చెప్పింది-అక్కా ! నే నికముం దేమిచేయవలెనో నాకు తోచ లేదు-తండ్రిగారు తలచినంత దుష్ప్రవర్తకురాలను కానే నేను ! (ఏడ్చుచున్నది.)

లీలా—మల్లికా, నీవుపోయి తండ్రిగా రేమిచేస్తున్నారో చూచి రా-సులోచన సంగతి మాటవరుసకైన నెత్తకుమా, నీ పుణ్యమాయెను. (అది పోవును) చెల్లీ, నీసమాచారమంతా చెప్పూ-నీవిక్కడి కెట్లు రాగల్గితివి ?

సులో—ఆరాత్రి అమ్మానాన్నగారున్నూ బుద్ధిచెప్పి వెళ్ళినపిదప నేను గదిలో పరుండడము మాత్రమే జ్ఞప్తి యున్నది. తిరిగీ కళ్ళుతెరచి చూచేటప్పటికి మహారణ్యమధ్య మున మంచముమీద నుంటిని. తరువాత ఈదేశపు యువ రాజు నా దీనదశకు జాలిజెంది పిల్చుకొని వచ్చి యిట విడిచి నారు. అదిమొదలు నా వృత్తాంతమెల్ల మరుగుపరచి హీన దాసినై జీవయాత్ర సల్పుతూన్నాను. నావల్ల నేమి నేర మున్నది ?

లీలా—చెల్లెలా, నీయందు నేరముందని నేనందునా? తండ్రిగారు తలచునంతటి అధమురాలవు కావని నే నెంత మొరపెట్టినాను! ఒక్క నేనాడిన మాటలు నిక్కమైనా తండ్రి గారిచెవి కెక్కవాయె. ఆతనికి మిక్కుటమగు కోపమేకాని

నిక్కుమారగాను విచక్షణ లేకున్నది. ఎవ రేమిచెప్పినా విన డము లేదు. పోనీ నిలకడమైని నీ నిజవృత్తాంతము నాతని చెవిని వేతామంటే ఈలోపున ధనాశాపిశాచాయత్తపాతకు లెవ్వరైనా నీ ఆచోకి అతని కెరిగిస్తే నీ ప్రాణమునకే హాని వచ్చును కదా అని తటపటాయిస్తున్నాను. మన కిప్పు డేది గతి? నాకేమీ తోచకుంది.

సులో—అవునా? ఈ రాజసుందరము వీడి వేరొక చోటికి తక్షణమే పొమ్మని మల్లిక నాకు సలహాయిచ్చింది.

లీలా—నిజమే, అదే మేలైన ఆలోచన-చెల్లెలా, అనుక్షణము గండమైన ఇచ్చోట నుండడముకన్న మల్లిక చెప్పినట్లు పలాయనమే శుభావహమని తోస్తూన్నది. దానిని నీకు తోడుగా నిచ్చెదను; అది నిన్ను గుప్తమగుచోటికి కొని పోయి రెండుమూడునాళ్ళు నీతో నుండును. ఇంతలో నేను తండ్రిగారితో నీ నిజవృత్తాంత మెరిగించి అతని కోపాగ్ని చల్లార్చెదను. పిమ్మట నంతా చక్కబడుతుంది...ఇదిగో నేనుపోయి మల్లికను పంపెదను, నీవింక నాలసించక వెంటనే పయనము కమ్ము. ఈ వృత్తాంత మతిరహస్యముగా నుంచుము.

సులో—సరే-గత్యంతరము లేదు కావున అట్లే చేస్తాను. కాని పిలుంటే ఈయూరు వదలకుండా నే నిక్కడ నుండు సూత్రము నాలోచించవా? ఇచ్చటనే నన్ను గుప్త ముగా నుంచరాదా?

లీలా—ఇదిగో-మన మిప్పు డాలోచించడానికి వ్యవధి

లేదు. నేనిటువచ్చి జాగెయ్యన్న, నన్ను జూచినప్పుడు ఎన్నడైనా ఇటువచ్చిరా సఖ్యమూ మాటా...మల్లిక వచ్చాతాను, నేను చెప్పినది మరువక. (కౌగిలించి ముద్దిడి పోవును)

సులో—అయ్యో! నేనెంతదానాభాగ్యురాలను! ఏ పాప మెఱుగని నాపై తండ్రిగారేల అనుమానపడినారు!...దీని గూర్చి యిప్పుడాలోచించిన ప్రయోజనమేమి? నాప్రాణములు నిల్పుకొను మార్గ మవలంబించవలెను...అయ్యో! ఈరాజభవనము విడిచి పోవలెనా?...అట్లొనర్చినచో యీనరాజు నెట్లు గాంచగల్గుదును? ఆతని జూడకున్న అసువులు నిల్పుకొనగలనా? నాకొర కిచటికి వచ్చి నన్ను గాంచక ఆతడెంత కుందునో? పోనీ-ఈవృత్తాంత మాతనిచెవిని వేయుదమన్నకైనా వీలు చిక్కకున్నదే. ఈసరికే వత్తునని బాస జేసి యింకా తడయుటకు హేతువేమో? ఏదో రాచకార్యమున మగ్నుడై యున్నాడేమో?.. ఏదియెట్లైనా నేనీయూరు వదలిపోతున్నా నన్నమాట అతనికి తెలియజేయకే నేను పోజాలను...నాప్రాణనాధున కొక లేఖ వ్రాసి పోతాను. (లోనికిపోయి కాగితము కలము తెచ్చి) అయ్యో! ప్రాణనాధా! మిమ్మొడబాసి ఈ ప్రాణములెట్లు భరింపగలను?... అబ్బా! లేఖ వ్రాయనీయకున్నదే ఈ కన్నీరు (మల్లిక వెనుకనుండి "అమ్మా" యని పిలుచును) ఇదిగో-వచ్చెను, ఇంచుక తాళు. (స్వ) దీని నాతనిగదిలో విడిచి వెళ్ళినట్లైతే ఆతనికంట నిది పడక తప్పదు. మల్లికా, తూర్పుగోపుర

ద్వారముచెంత నుండు, నేనిదే వస్తూన్నాను. (ఉత్తరముతో లోనికి బోవుచున్నది.)

(శ్రీదత్తు డాత్రముతో వచ్చును)

శ్రీద—సావిత్రీ, నా నేత్రమా, ఏమిది? నా అమృత వర్తి యేదీ? ఇక్కడనే ఉండుమని కదా చెప్పినాను? ఒకవేళ చిత్రరేఖా దేవి చెంత కరిగియుండునా?...ఎంత తప్పుచేసితిని! ఇదివరకే వస్తానని చెప్పి ప్రతాపశీలునితో ప్రసంగిస్తూ జాల ముసర్చితిని...సావిత్రీ, సావిత్రీ! ఏమిది? ఎచ్చటా కనబడదు ...నే నాలసించడము చేత నా భవనమునకు పోయిందా? పోయి చూచెదను...

---

—• రెండో రంగము •—

---

(శ్రీదత్తుని గదిలో లీలావతి.)

లీలా—మాల్లికను నాచేతిలో నుంచుకోవడము మేలే అయింది-ఆమెకు నేనిచ్చిన వేయిమొహిరీల పారితోషికము చాలను. ఆమె నాకొనర్చిన ఉపకారము కెంతిచ్చినా చాలదు. సులోచన వ్రాసిన ఉత్తరము నెట్లైనా చేజిక్కించుకోవలెను. ఇంతలో శ్రీదత్తుడు వస్తే...పర్వా లేదు. అతను వచ్చినా ఖించి పొయ్యేది లేదు....ఉత్తర మేది? (వెదకుతూ పోయి పట్టుకొని వచ్చును) ఇదిగో దొరికింది-చదివి చూస్తాను (చదువును)

ప్రాణప్రియా! నా మనోనాథా!... చించివేతునా?... వద్దు, తొందరపడి యేపనీ చేయరాదు-తుదముట్ట చదివితీరవలెను. (చదివి) అమ్మయ్యో! సులోచనా! ఇంతచాతుర్య మెక్కడ నేర్చు కొంటివే!... అబ్బా! ఎన్ని ప్రాణనాథాలూ, ఎన్ని ప్రియాలూ, మదపిచ్చి ఎత్తినట్లుంది దీనికి!...ఇదిగో మూడి మాట..."ఈరాత్రి తొమ్మిది గడియలకు తప్పక యిచ్చ టికే వచ్చి నన్ను చూడవలయునని ప్రార్థించుచున్నాను"... మొదట చించివేయవలెనని ఎంచితినే! ఎంత ప్రమాదమై యుండును!...సరే...ఇదే సరియైన చోటు దాని మోసగించ డానికి-ఈతొమ్మిది ఆరు చేసి తీరవలెను- (కంటికాటుక తీసి దిద్దుతూ) హాయిహాయి-ఈకాటుక ఎంత అక్కరకు వచ్చింది! ...ఇప్పటికే జాగయ్యెను, యువరాజువచ్చు వేళయింది, ఇంక నిట నుండరాదు-ఉత్తరమును ఎప్పటిదగ్గర నుంచెదను. సులో చనా! నీప్రియుడు నిన్నుతప్ప వేరెవ్వతెనూ కంటజూడనని నీతో బాసజేసెనని కదా మురుస్తున్నావు-రే పారుగడియల రాత్రి కాత డేమిచేయనున్నాడో చూడు...ఎవరో వస్తూ న్నట్లుంది-నే నుండరాదు (పోవును)

(శ్రీదత్త కమలాకరులు వత్తురు)

కమ—అయ్యా, మీకు తాల్మి లేదాయెను. సావిత్రి మీకు లేఖ వ్రాయక తప్పదు-ఇంతలో నీతొందరవల్ల ప్రయో జనమేమి?

శ్రీద—కమలాకరా! నా యారాటము నీవు భావింప

నేరవు. నా ప్రియురాలి కేదో కీడు మూడి యుండవలెను. ఎప్పుడూ నాకన్న ముందే వార్తిస్తూండేది-మా మందిరమువిడిచి ఆమె బైటపోవుటకు హేతువు కానరాదు....కమలాకరా... ఇదేమిది? ఇదిగో ఉత్తరము...సావిత్రి వ్రాసినట్లుంది-సందేహము లేదు-నాప్రేయసి వ్రాత నేనెరుగనా? (చదువును)

కమ—చూచినారా? ఎంత తొందర పడితిరి? నా మాట విన్నారా?

శ్రీద—కమలాకరా! ఇప్పు డెన్నిగడియలరాత్రి యైంది.

కమ—ఇప్పుడేకదా సూర్యాస్తమయ మయింది. ఎందు కడిగితిరి?

శ్రీద—సావిత్రి ఆరుగడియల రాత్రి కొకస్థలమున తన్ను చూడుమని వ్రాసింది. నే నక్కడికి తప్పక పోవలెను.

కమ—ఇప్పు డామెఉన్నచోటు సుదహరించిందా?

శ్రీద—అది వ్రాయలేదు. 'ఏవో కొన్నికారణముల చేత తానున్నచోటు బయలుసేయకూడదని వ్రాసింది. ఆరు గడియలరాత్రికి ఊరుబయటనున్న యువరాజనగరవు ఏటి యొడ్డున కొబ్బరితోటకు వచ్చి తన్నుచూడవలయునని వ్రాసింది.

కమ—అట్లైన త్వరలో బయలుదేరవలెను. మహా రాజుగారు వస్తూన్నట్లుంది, ఉత్తరము దాచిపెట్టండి.

(వాసవదత్తుడు విక్రమవీరుడూ వత్తురు. శ్రీదత్తుడు

తండ్రికి నమస్కరించును.)

వాస—శ్రీదత్తా! ఈ వినయములకేమి, నామాట చొప్పున నడువని కొడుకు నమస్కరించినా నమస్కరించకున్నా ఒకటే. ఇదే కడసారి అడుగుతూన్నాను, లీలావతిని పెళ్ళిచేసుకొందువా లేదా? (శ్రీదత్తుడు తండ్రికాళ్ళకడ వాలును) ఈ నక్కవినయములు పనికిరావు...నేను చెప్పినట్లు చేయని నీవు నాకొడుకువుకావు...మూడు దినములలో నారాజ్యము విడిచిపో, పిమ్మట ఇందు వసించితివా నీతల నాల్గుచెక్కలు చేయింతును. ఇదే నామనోనిశ్చయము. (రాజూ విక్రముడూ పోదురు.)

శ్రీద—కమలాకరా, నాకు ప్రియతమమైన వస్తువు లేకున్న నే నీరాజ్యమున నుండనేల? అది నాకు లభించెనా స్వర్గసామ్రాజ్య మబ్బినట్లే. బుద్ధి కర్మానుసారిణి అందురు, ఇదే కాబోలు.

కమ—ఏమి యీ ఉపద్రవము!

శ్రీద—నాకు ప్రయాణసమయ మాసన్న మవు తూన్నది, వ్యర్థసంభాషణమున కాలయాపన మెందుకు? శే ఫుదయము నా కొకసారి కనిపించు. (పోవును)

కమ—సర్వమూ వ్యత్యస్తమయింది, ఇక నే నూరకుండరాదు. మహారాజుగారివద్ద కేగి వారిని శాంతింప యత్నింతును. వీరి కిట్టి విపరీతబుద్ధి ఎందుకు పొడమినదో?

ఇతరు లెవ్వరైనా ప్రేరేపించియుందురు; ఇది నిశ్చయము. స్వతః వా రింతక్రూరస్వాంతులు కారు. (పోవును)

---

## —• మూడో రంగము •—

---

(యువరాజనగరము ఏటియొడ్డున కొబ్బరితోట)

లీలా—ఈ కొబ్బరితోటలో కాసెడు వెన్నెల ఎంత రమణీయముగానుంది! చల్లగావీచుగాలిలో చిలకలపలుకు లెంత శ్రోత్రపేయముగా నున్నవి! ఏటిలో అక్కడక్కడ పొడచూపుతూన్న నల్లనేనపురాళ్ళపై చిన్నచిన్న కెరటములు విరిగి కనువిందొనర్చుతూన్నవి. ప్రియులు సల్లాపము లాడుకొనడాని కెంతో యింపుగా ఉన్నది., ఇంతమట్టుకు సులోచన బుద్ధిమతే. కాని దీని కిట్టి యూహా లెట్లుపుట్టినవి? ప్రేమజాలమున చిక్కుకొన్నప్పుడు మూఢులకైనా ధీశక్తి అతిశయించు నను మాట నిజమే...ఆరుగడియలు కావచ్చింది, యువరాజు సులోచనను చూడవలెనని గంతులు వేసుకొంటూ ఉవ్విళ్ళూరుతూ వచ్చువేళ అయింది...నేను చేసిన మార్పు నాతడు గుర్తించగల్గునా? అది అసాధ్యము. ఆమార్పు సులోచన చూచినా పోల్చుకోలేదు....ఓసీ! సులోచనా, నీ ప్రియుడిప్పుడు నా ప్రేమవాగురులలో చిక్కుబోవుచున్నాడు. నీ వివ్వు డేమిచేయగలవు? పాపము, నీ యాశలన్నీ భంగములైనవి....అదే యువరాజు వస్తూన్నట్టుంది- దట్టముగా

కొమ్మ లల్లియుండడము చేత శీత కిరణప్రసారము లేని యిచ్చోట తారాడుతూన్న నన్ను సులోచన అని భావించి కౌగిలియిచ్చి ముద్దిడి తీరును. ఆపై నేను చేయవలసినది నే నెరుగుదును - నేను మొదట తొందరపడరాదు. కదలు మెదలు లేక కనుచుందును.. (కూర్చుండును)

(శ్రీదత్తుడు వచ్చును)

శ్రీద—సావిత్రీ, సావిత్రీ! ప్రేయసీ, నిన్నెంత వెదకినాను. (లీలావతిని, చూచి సావిత్రియని యెంచి తొందరగా వెళ్ళి ప్రక్కనే కూర్చుండును) ప్రేయసీ, రాజమందిరము విడచి యిక్కడికి వచ్చితివి, నామీద కోపమా? నే నేమి అపరాధ మొనర్చితిని? (మోము మోమున చేర్చబోయి లీలావతిని వింతమానిసి యని గుర్తించి తటాలున లేచును) ఆహా! మోస మాయెను—నారీ, నీ వెవతెవు?

లీలా—ప్రాణనాథా, నేను లీలావతిని. మీకు తెలి యదా?

శ్రీద—నిజ మాడుతూన్నావా? నీ విక్కడి కెట్లు వచ్చితివి?

లీలా—అంత తొందరయేల? ఇంచుక విశ్రమించ కూడదా? ఇక్కడ కూరుచుండుము నాథా!

శ్రీద—న న్నట్లు పిలువవద్దు. నే నిక్కడి కీవేళకు వత్తునని నీ వెట్లెరిగితివి? నీ విక్కడి కేల వచ్చితివి?

లీలా—మీరు వత్తురని నే నెరుగను.

శ్రీద—నీకు తెలియదా? ఎంత ప్రమాదము! లీలావతీ, నీ విక్కడి కెందుకు వచ్చినావు?

లీలా—ప్రాణకాంతా! మిమ్ము చూచింది మొదలు మీమీద నణచరాని మోహము గొంటిని. అది మొదలు నే పడెడు విరహతాప మింత అంత యని వర్ణింప నలవికాదు. రాజమందిరములో నుండలేక ఈ యేటియొడ్డున చల్లగాలిలో కొంచెము తిరిగితే తాపమేమైనా తగ్గునేమో అని ఇటు వచ్చితిని. నాపుణ్యవశమున మిమ్ము చూడగల్గినాను. మొక్కబోయిన దైవ మెదురయ్యెను. త్రికరణశుద్ధిగా మిమ్ము నేను వలచియుండడముచేతనే నాతలిదండ్రులు నన్ను మీ కివ్వ నమ్మతించినారు.

శ్రీద—వనితా, ఏమంటివి? స్త్రీసహజమగు సిగ్గైనా లేదా? నాడు రాజసభలో నిన్ను నేను వివాహమాడనని చేసిన ప్రతిజ్ఞ నెరుగవా? లేక మరచితివా? ఇప్పుడు చెప్తూన్నాను విను. నేను నిన్ను వివాహమాడను. నీవు వ్యర్థముగా నాపై మరులుగొన్న లాభము లేదు. నాపై మోహము విడిచి నీకనుకూలుడైన పురుషుని వరించుము...ఇం కొక మాట. నీవు న న్నిక్కడ చూచిన ట్లెవ్వరితోనూ చెప్ప వద్దు...పొమ్ము.

లీలా—మీమాటచొప్పున చేసెదను, కాని నామాట కొంచెము వినండి. నేను మిమ్మే వలచితిని. ఈబాలి నే మాన

జాలను. మిమ్మెప్పుడు వరించితినో అప్పుడే మీకు భార్యనైతిని. అట్టినన్ను మీరిట్లు పోదోయ జనునా? దీనునగు నాపై కృపవహించి నన్ను పరిగ్రహించడము ధర్మము కాని పరిత్యజించడము న్యాయము కాదు.

శ్రీద—నీవు నాతివి కావు... (కోపముతో పోవును)

లీలా—(అడ్డు నిల్చి) రాకుమారా? నే నెవతెనైన కానిమ్ము, మిమ్ము కొన్ని ప్రశ్న లడిగెదను, వాటికి తగిన జవాబు లిచ్చిమీరు పోవచ్చును. న్యాయమార్గము తెలిసియుండీ అడిగినవారికి చెప్పకున్న నరకము ప్రాప్తించుననే ధర్మసూత్రము మరవకండి.

శ్రీద—సరే-నీ వడుగదలచినది వేగ మడుగు.

లీలా—దయచేసి కూర్చున్న తప్పా?

శ్రీద—నేనిక్కడికి రావడమే తప్పు, కాని మ్మడుగు.

లీలా— రాకుమారా, ఒకని తప్పునకు వేరొకని దండించడము ధర్మమా? ఎవరుచేసిన తప్పులకు వారిని శిక్షించుట ఒప్పు-మొదట మీతండ్రిగారు మీకు నన్నిచ్చి వివాహము చేయవలసిందని మాతండ్రిగారి వద్దకు రాయబారి నంపినారు, అందుకు మాతండ్రిగారు సమ్మతించినారు. అప్పుడే మీకు నేను భార్యనైతిని కదా! గాంధారీదేవి చరితము మీరు విననిది కాదుగదా? ఆమె తండ్రి యామెను ధృతరాష్ట్రునకిచ్చి వివాహమొనర్ప సమ్మతించిన నాడే తాను ఆతని పత్నిఅయ్యెనని యెంచి, ధృతరాష్ట్రుడు పుట్టంధుడని

యెరిగినపిదప నామె నందగూ ఎంత వారింపఁబూనినా మానక తనపాతివ్రత్యమునకూ సౌశీల్యమునకూ భంగము రాకుండ ఆతనినే వివాహ మాడలేదా? ఇప్పుడు నన్ను మీరు ప్రతి గ్రహింపకున్న నాగతి యే మవుతుంది? సాళ్వుని మనసార వరించిన అంబను భీష్ముడు వెడలనడిపి తత్ఫల మనుభవించ లేదా? మీతండ్రిగారు మీయుద్దేశ మెఱుగక నన్నడుగ బంపుట తప్పని అందురా? కానిండు. ఆతడు చేసిన తప్పునకు మీరు నన్నేల దండింప దలచినారు? ఇది న్యాయమగునా? ...ఇంకొకటి-ఒకకన్యక నొకపురుషుడు అకస్మాత్తుగా అంటి నట్లైతే ఆమె ఆతనిభార్య యనిపించుకొనదా- అట్టికన్య ఇంకొకని గాత్రము నంటజెల్లునా? అందు వల్ల ఆమె శీలము నకు కళంకము సోకదా? ఇట్టిసందర్భముననే కదా దేవయాని బ్రాహ్మణకన్యక అయినా తన పాణి నంటిన యయాతిని పెళ్ళియాడవలసి వచ్చెను. మీరు నాకరము నంటుటే కాక నాసరస కూర్చుండి సల్లాపములాడి నన్ను కౌగిలించి ముద్దిడ సిద్ధులైతిరి. మీపత్నినగుటకు నాకింతకన్న బలవత్తర నిదర్శ నము లేమి కావలెను? మనోవాక్కాయముల మీకర్ధాంగి నైన నన్నిక సిలుగులు పెట్టక ఏలుకొనరాదా? మోహావేశ రాల నగునన్ను పైకొని మరుబారికి లోనుగజేసి ఏదో లేని పోని నియతిచే నందియముగొని నన్ను నిరాకరించడము పాడియా? నేను మిమ్ము బలవంతపెట్టి మొదట తాకినానా? మీరేకదా నన్ను స్పృశించినారు! ఈ తప్పెవరిది? ఎవరు

శిక్షింపబడుతూన్నారు?... మీరు నన్ను పరిగ్రహింపక పోయిన నింకొకని కలలోనైన తలచుట నాబోటి కులీనకు కూడునా? నాశీలమునకు భంగము వాటిల్లదా? స్త్రీలకు ముఖ్యదైవము పతి కదా, నేను మీచే తిరస్కరింపబడి ఇంకొకని చెట్టపట్టనొల్లక అనాథనై యుండిన ఫలమేమి? శోకాగ్నిలో ప్రమందుటే శ్రేయముకదా? నాహత్యవల్ల రానున్న అపకీర్తి పాపమూ ఎవరిది? స్త్రీహత్యయే ఘోరము, అందూ నేను కన్యను, నాహత్య ఎంత క్రూరమో యోచించండి.

శ్రీద—అబ్బో! ధర్మశాస్త్రము బాగా చదివితివే!

లీలా—మీ రేమన్నా సరే, నేను మాత్రము మిమ్ము దక్క వేరొకని వరింపను. భగవత్సాక్షిగా చెప్పుతున్నాను. ...రాకుమారా! విశుద్ధప్రేమ మగ్నయై తానుగా వచ్చిన తన్వితమి దీర్పవలదా? భూతదయా పరుడవు కావా? నన్ను దరిజేర్పుము.

శ్రీద—ధూర్తురాలా, దూరమున నుండుము.

లీలా—రాకుమారా, అట్లే ఉండును. మీయాజ్ఞ నుల్లంఘింపను...ఒక్క మాట-మీ రుత్తమక్షత్రియులు, పరిశుద్ధ వీరులు; శరణాగతులగు శత్రువులనైనా దరిజేర్చి వారి దుఃఖ మపనయించడము మీ కుత్తమధర్మము కాదా?... నేను వట్టిగోలనని యెన్నక చిత్తజుడు నాపై పగబూని దోషాకరుని సహాయముగా కొని నదీఘోషయను జ్యారవముతో తన పంచబాణములు నొక్కుమ్మడి నాపై గుప్పి నాయంత

రంగమంతా చిల్లులు పడ జేయుచున్నాను-పగతురిట్లు మీమ్ము శరణుజొచ్చిన నన్ను బాధిస్తూంటే మీరు, ఊరకుందురా? ఇంక కొంతకాల మిట్లేయున్న నా ప్రాణములు నిల్వవు. ఇక తామసింప జెల్లదు. అభయ మిమ్ము నాథా (దరికి జేరును)

శ్రీద—దుర్మార్గ గామినీ, నా చెంతకు రాకు. పడతి వగుట బ్రతికితివి- నీచర్య అమానుషము...నీవంటి పిశాచ మును చూస్తేనే పాపము! అయ్యో! నే నెంతపాతక మొన ర్చితినో ఇట్టి సంకటము ప్రాప్తించెను!

లీలా—ప్రాణేశ్వరా, మీరు నన్ను చేకొనకుంటే ఆత్మహత్య కావించుకొందును. తత్పూర్వ మొక్కసారి నన్ను కౌగిలించి ముద్దివ్వండి-ప్రాణప్రియా, ప్రాణేశ్వరా!

శ్రీద—నీవు నిజముగా రాక్షసివే, పిశాచమవు-పో!

(పోవును)

లీలా—అయ్యో! విధీ! నేనెంత నిర్భాగ్యను!.... బలే! ఈరాకుమారుని మనసు దిటమే దిటము! నా యావ చ్ఛక్తి నుపయోగించినా ఈతని మనస్సు తిప్పలేకపోతిని. ఇంచుకైనా ఈతనిమది చలించలేదు. నాపాలిటికి యముని వలె ఈసులోచన ఏల పుట్టింది?...యువరాజా? అబల నని యైనా ఆలోచించక నన్ను తిరస్కరించితివి! నా కడుపు ఉడుకు తూన్నది. నాఉసురు నీకు తగులకుండునా? నేను వియోగాగ్ని చేత దహింపబడినట్లు నీవుకూడా దహింపబడవా? పాపీ! నే నెంతవేడినా ఒక్క ముద్దియ్యవైతివి...ఆనా డాసులోచనకు

మాటకొక ముద్దిచ్చితివే-నే నేమితక్కువైతిని? ...నాహృదయ మిట్లు క్షోభిస్తూంటే మీరిద్దరూ సుఖముగా జీవింతురని యెంచితివా? అయ్యో, విధీ! నాతల నిట్లు వ్రాసినావా? ఎన్ని ప్రయత్నములు చేసినా యువరాజు తిక్క తిరుగకున్న దే-...ఇప్పుడు చింతించిన ప్రయోజన మేమి?... నాధైర్య మెక్కడకి పోయింది, నాపూనిక ఏబుగ్గిలో కలిసింది?...లీలావతీ! అందరినీ నీవలలో చిక్కించుకొనజాలు నీవు అల్పుడగు ఒకరాకుమారుని వలపువలలో చిక్కుకొందువా? ఛీఛీ! నన్నే నేను మరచితిని-ఇది దిటమైన ప్రణయప్రభావము-యువరాజా-శ్రీదత్తా, వలచివచ్చిన నన్ను తృణీకరించినావు, నాప్రాణములు తీయడమునకైనా వెనుదీయవైతివి! చూడు-నీపాలిటికి నేనే యముడ నయ్యెదను. ఏసులోచనపై మోహముచేత నీవు నన్నిసడించితివో ఆసులోచన మూలాన నీప్రాణములు పోవు వెరవు కల్పింపకున్న నేను లీలావతినికాను. అంబ భీష్మునికి మారకురాలు కాలేదా? నీయందలిప్రేమనెల్ల రోతగామార్చెదను. ఈలీలావతి బుద్ధిమహిమ చూపెదను చూడు! ఇదిగో సులోచనకు నీవిచ్చిన ఉంగరము, దీనినే కుద్యముగా జేసి అద్భుతరచన కావించెద గాంచుము....నేను తొందర పడరాదు. ప్రతాపశీలుని నిమిత్తముగా గొని కార్యసిద్ధి గాంచవలయును, ఆతడు నేను చెప్పిన ట్లాచరించువాడు కాని అన్యథా వర్తింపజాలడు. ఈయుంగరమాతనిచేత శ్రీదత్తునికి చూపించి అనుమానము పుట్టునట్లు చేయువలయును. అనంతర

కర్తవ్య మటుపై నాలోచించ వచ్చును. రాకుమారా! నా ధీశక్తి గనుము. (పోవును)

(శ్రీదత్తు డొకఉత్తరముతో ప్రవేశించును)

శ్రీద—అమ్మయ్యా! శని వీడినది. ఏమి వింత! ఇది సావిత్రి స్వహస్తలిఖితమే అందుకు సందేహములేదు-ఆరుగడియల కిచ్చటికి వత్తునన్న ఆమె రాకుండడమునకు హేతువేమి? ...ఇంక కొంచెమునే పాగి చూస్తాను....అయ్యో! ఎంతతప్పు చేసితిని! ఆత్రిమున ప్రమాణమును తృణీకరించితినే. సావిత్రీ! సావిత్రి! ఇంకను రావేమి? (సులోచన వచ్చును)

సులో—ఇంకా తొమ్మిది గడియలు కాకున్నా నా నగరులో నుండడమునకు మనస్కరించలేదు....ఎవ రక్కడ నున్నది? (చూచి) నా ప్రాణనాథుడే కాబోలు? ఆఁ! ఔను-ఆతడే. (దగ్గరబోయి) నాకన్న ముందే ఈత డిచ్చటికి వచ్చెను. ఏమి నాపుణ్యము!... అదే నేనువ్రాసిన యుత్తరమాతనిచేతిలో నున్నది.... నాథా, ఎంతసేపాయె మీ రిచ్చటికి వచ్చి?

శ్రీద—(లేచి దూరముగా నిలుచును)

సులో—ఏమిది? దూరమున నిలిచి యున్నారు-కోపమా?

శ్రీద—సావిత్రీ! ఇంక నీచేతితో నీవు నన్నంటరాదు.

సులో—ఇదేమి? పరియాచకమా, లేక ప్రణయకోపమా? (అంటబోవును)

శ్రీద—అంతరాకు-నామాట విను, పిమ్మట నన్నంటగూడితే అట్లుచేయవచ్చును.

సులో—సమాచార మేదో చెప్పండి. కూర్చుండరాదా? (కూర్చుండ బెట్టును) ఏలాగో మీ మోము వాడియున్నది. సంగతి చెప్పుడు.

శ్రీద—నీయెదుట నేను చేసిన ప్రతిజ్ఞ నిల్పుకొనలేకపోతిని.

సులో—అదెట్లు? ప్రతిన ఏమి? తప్పుడ మేమి?

శ్రీద—నిన్నుతప్ప వేరొక కాంతను కన్నెత్తి చూడనని మాట యిచ్చితిని, జ్ఞాపక మున్నదా? ఆమాట నిల్పుకొనలేకపోతిని.

సులో—ఎట్లు?

శ్రీద—నీ వీయుత్తరమున వ్రాసిన ట్లారుగడియలకిక్కడికి వచ్చితిని. ఈ చెట్లచాటున ఒక కాంత కూర్చుండ గాంచి నీవని భ్రమించి ఆత్రమున ఆమెకరము నంటితిని—వెంటనే తప్పుచేసిన ట్లెరిగి ఎంతో వగచితిని-కాని ఏమి లాభము?

సులో—ఆమె ఎవతె? ఇక్కడి కెట్లు రాగల్గింది?

శ్రీద—కాని నీవెరుగవు. అ దెట్లిచటికి వచ్చినదో చెప్పింది—అది నేను చెప్పరాదు, నీవు వినరాదు. ఆమె పరాక్రమకేతు పెద్ద కూతురు—పేరు లీలావతి అట.

సులో—లీలావతా?

శ్రీద—నీ వెరుగుదువా దానిని?

సులో—ఎరుగుదును కాని, నాకొక సందేహము కలుగుతూంది. ఆమె లీలావతి అని మీకు నిశ్చయముగా తెలుసునా?

శ్రీద—ఆహా! సంశయ మావంతా లేదు. ఆమెయే చెప్పింది?

సులో—లీలావతి ఎక్కడుంది?

శ్రీద—పట్టణమునకు పోయియుండును-నీవు కావని తెలిసిన వెంటనే కోపము పట్టజాలక నే నామెను పరుషము లాడితే, ఏమేమో కారు లరచింది, తన్ని తరిమి వేసితిని.

సులో—అయ్యో! నాథా! సుకుమారి నట్లేల తన్నితిరి?

శ్రీద—సుకుమారి! సిగ్గెల్ల పోనాడి తన్ను పెండ్లియాడుమని పోరు పెట్టింది.

సులో—లీలావతా ?

శ్రీద—ఔ నామెయే.మానిసి కాదు రాక్షసి-పిశాచి-

సులో—లీలావతై యుండదు-ఆమెను నే నెరుగుదును. ఆమె అట్టి హీనవర్తనురాలు కాదు- వేరెవ్వతెనో చూచి మీరు లీలావతి అని భ్రాంతిచెందియుందురు.

శ్రీద—భ్రాంతి! ఆమె నీవని యెంచడము భ్రమకాని ఆమె లీలావతి కావడము భ్రమయే! ఆమె చెప్పితేనే? అది నన్ను కికురించి యుండవచ్చును - పోనీ ఆగొడవ నా కేల?

ఎవ్వతె యైననేమి?

సులో—మోసము మాట నిజము కావచ్చును-భువన మోహనులగు మిమ్ము చూచిన—

శ్రీద—ఆప్రసంగము చాలు. ఆమెస్త్రీయగుట సత్యము-నేనామెకరము నంటుట ప్రత్యక్షము. తప్పుచేసిన వెనుక తల్లడిల్లిన ప్రయోజన మేమి? దోషము దోషమే కదా? ఈయపరాధమునకు తగిన దండనము నేనే విధించుకొందును. ఈ చేయి కదా తప్పు చేసింది, దీనిని ఛేదించితే తప్పు తొలగిపోవును. (కత్తి తీయుగా సులోచన గట్టిగా పట్టుకొనును)

సులో—నాథా! ఏమి యీ వెఱ్ఱి? కత్తి నిటు తెండు-మీరు చేసిన తప్పునకు మీరు తగిన శిక్ష విధింపనేరరు. నేను విధించెదను.

శ్రీద—నాకు సమ్మతమే-ఎట్టి ఘోర శిక్షనైనా వహింతును.

సులో—నేను చెప్పేది వినండి-మొదట మీరు తప్పే చేయలేదు-వేరొక స్త్రీయని ఎరిగియుండీ ఆమెను మీరు తాకితే తప్పు; నేనని భ్రమపడి ఆమెచేయి పట్టుకొనడము నాచేయి పట్టుకొన్న ట్లగును. ఇంకొకటి, నిజ మెరిగినపిమ్మట ఆమెను తిరస్కరించడమే కాక, పాపము తన్ని తరిమివేసితిరి. ఇందు తప్పేది? నాచెయ్యి పట్టుకోవడ మెంత తప్పో అంతతప్పే మీరొనర్చినారు. ఇందుకు తగినశిక్ష యిది. (చేయిముద్దు పెట్టుకొనును)

శ్రీద—ప్రేయసీ-నీవువిధించినశిక్షఎంత కఠినమైనానాకు మోదకరమే. నీ అనసూయాది సద్గుణము లెంతని కొని యాడుదును?...ఓహో! మేఘము లావరించు చున్నవి, జడివాన కురుసునేమో? దగ్గరనున్న ఇంటికి పోదాము పద. ఇచ్చటి యావద్వృత్తాంతము నెరింగించెదను—






# ఐదో అంకము

---

## మొదటి రంగము.

(రాజమందిరమున యువరాజు విడిదిలో పద్మాక్షి)

పద్మా—శ్రీదత్తు డేడీ? ఇక్కడా లేడు. ఇతని దర్శనమే దుర్లభముగా ఉంది. ఇక్కడికి రాకమానడు కదా! కొంచెము సేపు తాళి చూస్తాను.... ఈసావిత్రి సులోచన అయియుండునా? సులోచన కాన్పించని కాలమూ, ఇక్కడికి సావిత్రి వచ్చిన కాలమున్నూ ఒకటే లాగున్నవి. సులోచనే అయితే మారుపేరున దాసిగా నుండనేల?...ఇప్పు డాకస్మికముగా రాజభవనము విడిచిపారిపోనేల? దంతవక్రుడు చెప్పిన మాట నిజమా? ఛీఛీ! అట్లెన్నడూ జరుగనేరదు. ..ఈసావిత్రి సులోచనకాదు...కాని నాకు సందేహముగానే ఉంది. సావిత్రి రూపమూ చేష్టలున్నూ సులోచనను జ్ఞాపకము చేస్తూన్నవి-యువరాజే కదా సావిత్రిని తీసుకొని వచ్చి చిత్రరేఖా దేవికి దాసిగా నొప్పగించెను. అతని నడిగిన సర్వమూ తెలియగలదు. అత డింకా రాకపోవడానికి హేతువేమి?

(విచిత్రశర్మ వచ్చును)

విదూషకా, యువరాజు జాడ నీ వెరుగుదువా?

విచి—నాకు తెలియదు.

పద్మా—నే నాతని గాంచవలెను. ఎచ్చట వెదకినా కానరాలేదు-ఆతని పత్తా ఎవ రెరుగుదురు?

విచి—నామరిది అన్నయ్య తాతగారి పెద్దకుమారుని మామగారి తమ్ముడి మేనల్లునికి ఒకవేళ విడిచిన అక్క బంధువులలో నెవ్వరికైనా తెలిసియుండవచ్చునేమో?

పద్మా—ఇప్పుడు కూడా నీహాస్యము మానకున్నావే! హాస్యమునకు దేశకాలపాత్రములు లేవా?—నిజముగా యువరాజుండుచోటు నీవెరుగవా?

విచి—అట్లడిగెద వేమి? హరిశ్చంద్రునినోట అసత్యము వెలువడునా? (పద్మాక్షి కోపముతో పోవును) నానోట నబద్ధమువచ్చునా? ఇంతవరకూ యువరాజుజాడ ఎవ్వరికీ తెలియనీయకుండా తప్పించుకొని వచ్చితిని. అరరే! ఇదేమి! ఇతడిల్లు వస్తూన్నాడు? (విక్రమవీరుడు వేగముగా ప్రవేశించును.)

విక్ర—అయ్యా? యువరా జెక్కడ?

విచి—అంత మునిగిపోయిందేమి?

విక్ర—మహారాజావారు చూచి రమ్మన్నారు-యువరాజుగా రేరీ?

విచి—అయ్యా! మీరు వేమన్నశతకము చదివినారా?

విక్ర—ఆనంగ తిప్పు డెందుకయ్యా? యువరాజెచ్చట నన్నాడో చెప్పవేమి? నాకు తొందరపని ఉంది.

విచి—అంత తొందరగా అడుగుతే నేను చెప్పను.

విక్ర—నన్ను చంపక చెప్పవయ్యా నీకు తెలిస్తే.

విచి—ఒక్కక్షణము కూర్చో-బెంగపడకు. పర్వా లేదు, కూర్చో.

విక్ర—ఇదిగో కూర్చున్నాను-త్వరగా చెప్పు,ఇప్పటికే ఆలస్యమయింది.

విచి—ముందు నాప్రశ్నకు సమాధాన మివ్వవలెను. వేమన శతకము చదివినావా?

విక్ర—చదివినాను.

విచి—అట్లయితే "తామసించిచేయు తగదెట్టికార్యంబు" అన్నతరువాత "వేగిరింప నదియు విషమమగును" అని లేదా?

విక్ర—ఓహో! వ్యర్థప్రలాపనము లాడడానికా నన్నిచట కూర్చుండు మంటివి?

విచి—అదిగో, "వేగిరింప నదియు విషమమగును"-కూర్చోవయ్యా! ఏమి సమాచారము?

విక్ర—యువరా జెక్కడ నున్నారో చూచి తామాతనితో మాటలాడ వస్తూన్నామని చెప్పుమని మహారాజు గారు నన్నంపినారు. తొందరగా పోవలెను-ఇప్పుడైన వేగము చెప్పు. యువరాజుజాడ తెలుసునా నీకు?

విచి—ముందే చెప్పితినే! ఇంకోసారి చెప్పెదను. ఇట్లు తిన్నగా పోయి కుడిప్రక్కకు తిరుగుతే మూడుద్వార ముల లోగిలి కాన్పించును. దానిమధ్యనుండి పోతే-ద్వారము తగలకుండా చూచుకొనవలెను- తెలిసిందా?

విక్ర—వేగము చెప్పవయ్యా.

విచి—అక్కడినుంచి సూటిగా పోతే మేడఅడ్డుంటుం ది, దానిపైకి పోవడానికి మెట్లున్నవి. ఆమెట్లెక్కి-దక్షిణముగా తిరిగి ఉత్తరముగా చూస్తే మూడు మండపము లగుపడుతవి. అందు నడుమనున్న చిత్రమండపములో యువరాజు......

విక్ర—ముందే చెప్పరాదయ్యా! చిత్రమండపము లోనా యువరాజు గారున్నారు?

విచి—అక్కడుండరు.

విక్ర—తిరిగీ హాస్యమే! యువరాజుండని చోటానిన్ను నేనడిగింది?

విచి—అదిగో "వేగిరింపనదియు విషమమగు"నని నేను చెప్పలేదా? తొందరపడెదవేమి? ఇదిగో చెప్పుతున్నానువినుః.

విక్ర—యువరాజులేని చిత్రమండపము గొడవనాకెం దుకు? యువరాజుండుచోటు చెప్పవయ్యా.

విచి—అదికాదు. చిత్రమండపములో యువరాజు లేడు కావున అచటికి పోవద్దని చెప్పదలచుకొన్నాను-మీారు సావకాశముగా నన్ను చెప్పనియ్యరే!

విక్ర—ఈ డొంకతిరుగుడు మాటలు చాలించి అత

డున్నచోటు ఎరిగింపవయ్యా, నీకు పుణ్యముండును.

విచి—చిత్రమండపానికి పోక నీముక్కుకు సూటిగా వెళ్ళితివా, ఎడమప్రక్క నొకత్రోవచీలియుంది. ఆమార్గమున పోవునప్పుడు తూర్పుదిక్కున దృష్టినిల్పి పోతే తల కొకగోడ తగులును.

విక్ర—ఏమయ్యా, దెబ్బలు తగిలే మార్గాలే చూపుతూన్నావు!

విచి—"వేగిరించ నదియు విషమమగును" అత్రోవనుపోక తూర్పు నకేగుము.

విక్ర—మంచి పద్యమే దొరికింది. ఆలస్యంచేసిచంపక శీఘ్రముగా చెప్పవయ్యా!

విచి—అయిపో వచ్చింది. మీకు ఈతవచ్చునా?

విక్ర—ఈత ఘోష యిప్పుడెందుకయ్యా!

విచి—బాగుబాగు. తూర్పునకే తిన్నగా పోతే ఒకపాడునుయ్యి కనబడును. అందులోపడి త్వరగా ఈదుకొని పోవచ్చును.

విక్ర—ఇంక నాలస్యము సైపజాలను. నీతో హాస్యమాడుటకా నేనిటకు వచ్చినది?

విచి—తొందర వద్దని మొదటే చెప్పినాను.

విక్ర—ఇదిగో కడసారి అడుగుతూన్నాను. చెప్పెదవా లేదా?

విచి—ఇదిగో నేనూ కడసారి చెప్పుతున్నాను, చెప్ప

నిస్తావా, లేదా? వేగిరిస్తే కార్యము విషమిస్తుంది—విను-ఆ నూతిని దాటిపోయి పడమటి ప్రక్కకు తిరిగి వాసనబట్టి వంటింటికి పోతే అక్కడుంటారేమో?

విక్ర—యువరాజుగారా?

విచి—కాదు, మా అన్నగారు.

విక్ర—సరిపోయింది. ఇంతసేపూ మాటలాడి నన్నిక్కడ ఆపినది మీఅన్నగారున్నచో టెరిగించుటకా? నీదుండగములను మహారాజు గారికి నివేదించి నీపని పట్టిస్తానుండు.

విచి—అదిగో తిరిగీ తొందరపడుతున్నావే! కార్యము విషమిస్తుంది సుమా!...యువరాజుగారున్నచోటు నాకు తెలియదు-మా అన్నగారు పెద్ద జ్యోతిష్కుడు. అతని వద్దకేగి ప్రశ్న వేస్తే అరగడియలో ఆతను చెప్పగలడు. రిక్తహస్తములతో పోక దక్షిణ ఏమైనా కొనిపొమ్ము-వేగిరించిన కార్యము విషమ మవును సుమా!

విక్ర—మహారాజుగారితో చెప్పి నీమచ్చ మాపెదనుండు. (పోవును)

విచి—అయ్యో! తొందర పడకు... ఇతడు పోయి రాజుగారితో నేమి చెప్పునో? మించిపోయిన తరువాత మరి చేసేదేమి? ముందుగా పోయి అడ్డకర్ర వేస్తాను. (పోవును)



## —• రెండో రంగము •—

(యువరాజు పురములో నేటిదరి కొబ్బరితోట)

(మగవేషమున లీలావతి, సులోచనయు వత్తురు)

సులో—అక్కా! తోవలో నిన్నెవ్వరైనా పట్టుకుంటే నీ వేమిచేసి యుందువు.

లీలా—నేనెంత జాగ్రత్తతో వచ్చినానో నీవూహించ లేవు-నాతో బాగా పరిచయ మున్నవాళ్ళు తప్ప ఇతరులు నన్నీదుస్తులతో చూస్తే నేను స్త్రీనని ఆనవాలు పట్టడము మిక్కిలి కష్టము-నీవే నన్ను పోల్చుకొనలేక పోతివిగా?

సులో—ఈవేష మెన్నాళ్ళనుండి వేస్తున్నావు?

లీలా—నేటిమధ్యాహ్నము రాజభవనములో నున్నప్పుడు వెనుకటి వృత్తాంతమంతా జ్ఞప్తికి వచ్చింది. చిన్నప్పుడు మన తండ్రిగారు తనకు మగపిల్లలు లేనందున నాకు మగవేషము వేయించి మగవానిలాగే విద్య,బుద్ధులూ, వ్యాయామమూ నేర్పించి, ముచ్చట తీర్చుకొనవడము స్ఫురించింది. పెద్దదాన నైనాను కదా,ఇక మగవేషము నాన్నగారు వేయించబోరు, కావున కడసారి నేనే అట్లుచేసి చూస్తానని నిశ్చయించి పురుషోచిత వస్త్రాలంకారముల నెల్ల దాల్చి నారూపలావణ్యాదికము నద్దములో చూచుకొని, ఈ వేషము చూచి మెచ్చి వేడుకచెందడమునకు సులోచన లేక పోయెను కదా అని పరితపించి, తత్క్షణమే ఎవ్వ రెరుగకుండా నీవద్దకు వచ్చితిని.

సులో—ఈవేషము నీకు చక్కగా అమరింది సుమా, నిన్ను బాగా ఎఱుగనివాళ్ళు ఇప్పుడు చూస్తే నీవు మగ వాడవనే తలంతురు. మన మింటిలోనే ఉండి మాటలాడుకొనడము శ్రేయము కదా, ఊరిబయటకి నన్నేల పిల్చుకొని వచ్చినావు?

లీలా—అక్క డెవ్వరైనా ఉందురు, ఇక్కడో ఒక పిట్టయైనా లేదు. అదీకాక-ఇక్కడిగాలి ఎంతచల్లగా నుంది? దీనియందు తనివితీర విహరించక నాల్గుగోడలమధ్య నగళులలో పాతుపడడానికి మన మేమిపాప మొనర్చినాము? ఈ చలువ రాతిమీాద కొంతసేపు విశ్రమించి పోదాము-(కూరుచుందురు)

సులో—అక్కా! పలుమారు వెనుక కన్నేల చూస్తున్నావు?

లీలా—ఎవ్వరైనా మనలను చూస్తున్నారేమో అని-చెల్లెలా-నీతో కొంత రహస్య మాడవలసి యున్నది. నేను తండ్రిగారితో ఏకాంతమున నీవృత్తాంత మంతా చెప్పి, కోపము చల్లార్చి, నిన్ను వారనుగ్రహించే టట్లు చేయ గలనను పూర్ణవిశ్వాసము నాకుంది. కాని నన్నొకసందేహము పీడిస్తూంది. తండ్రిగారు నిన్ను ప్రతిగ్రహించి శ్రీదత్తునకిచ్చి పెళ్ళిచేయ యత్నిస్తే ఆ యువరాజు "ఓహో! ఈమె మా యింట హీనదాసిగా నుండెనే, కులహీనపుకన్నె నెట్లు పెండ్లి యాడుదు"నని మనన్కరించక నిన్ను ప్రత్యాఖ్యాన మొనర్చునేమో? ఆ సడి మన మోర్వగలమా?

సులో—ఇందుకు నీవు సందేహింప నవసరము లేదు. నీకొక రహస్యము చెప్పుతాను. దాని నెవ్వరితోనూ చెప్ప వద్దు. యువరాజు నన్ను ప్రేమించును, అంతే కాదు, నన్నుగాక అన్యుల వరింపనని వాగ్దానము చేసియున్నాడు. నేనూ ఆతనినే ప్రేమించి నామానప్రాణము లాతని కర్పించినాను. నేను సులోచననని ఎవరూ ఎరుగరు; నావృత్తాంత మంతా గోప్యముగా నుంచినాను. మే మిద్దర మన్యోన్యప్రేమబద్ధుల మగుటచేత మాకిద్దరికీ వివాహము కాకతీరదు. ఇతరులు మాలో నెవరినైన వివాహమాడుట అసంగతము,అసంభవము.

లీలా—అటులనా? చాల సంతోషము-సులోచనా, ఈసంగతిని నాకైనా తెలియకుండా యిన్నాళ్ళు దాచిపెట్టితి వేమి! నీప్రియు నచిరకాలమున భర్తగా పొందుదువుగాక!

(శ్రీదత్తుడు దూరమున నిలుచును)

అప్పుడు నన్ను మరచిపోయేవు సుమా! (ముద్దుబెట్టుకొనుచుండ శ్రీదత్తుడు ప్రూస్వడి కొంతవడికి తెలిపగొని కోపముతో కత్తితీయుబూని యొరలో నది లేకపోగా ఊరి వైపు పరువెత్తును- అది చూచి లీలావతి నవ్వును.)

సులో—అక్కా! నవ్వుచున్నా వేమి?

లీలా—నీ వెంత సమర్థురాలవైతివని సంతసిస్తున్నాను. యువరాజు నీపై మరులుగొనుటకు వ్యవధాన మెక్కడిది? నిన్నాతడు చూచి ఎంతకాల మయింది,నవిస్తరముగా చెప్పు.

సులో—ఇంటికి వెళ్ళినపిదప అంతా తెల్లముగా

చెప్పెదను. (తడువుచు) అయ్యో! ఉంగరమేదీ?

లీలా—ఉంగర మేమిటి?

సులో—అన్నా! యువరాజిచ్చిన యుంగర మది. దాని నెప్పుడూ పోగొట్టుకొనకూడదని చెప్పినాడు. ఎక్కడ జారిపడ్డదో కదా?

లీలా—సులోచనా, నీ పుంగానోటికి నేను వచ్చి నప్పుడు నీశయ్యమీఁద నొక యుంగరము పడియుండెను. అదే కాబోలు నీవన్నది?

సులో—అక్కడే జారిపడిందేమో! త్వరగా పోయి చూతాము రా! (పోవుదురు.)

—: మూడో రంగము :—

(మార్గమధ్యమున నొక బహిరంగస్థలము, కారుచీకటిలో లీలావతి పురుషవేషమున వచ్చును.)

లీలా—శ్రీదత్తా! నా యాశలన్నీ భంగము కావించి నందుకు నీకు తగినశాస్తి అయిందిగా! నా మనస్సును గాఢముగా నొప్పించినందుకు నిన్నూరక విడుతు ననుకొంటివా? నీచిత్తమున కిక శాంతియన్నది కల్గునా? నీవిప్పు డనుభవించు యాతన ఘోరనరకబాధను మించదా! నన్నెందు కలయించి నావు? రాయితవ్విన చేయి నొవ్వదా?...సులోచనా? నీ గర్వము ఖర్వమాయెను గదా! నీకు నేను విధించిన శిక్ష

తగిన దే. శ్రీదత్తుడు నిన్ను చూపుమాపడము నిజము. నీ ప్రియుడే నిన్ను దండించుట ఉత్తమము కదా? నిన్నంత మొందించి నీప్రియుడు నాదరిజేరి నన్ను పెండ్లియాడుమని వేడుకొనడము ప్రేతరూపమున నీవు చూడగలవు.... శ్రీదత్తుని చర్య, ఆతని ముఖవైఖరీ పట్టిచూస్తే సులోచన యీపాటికి శాశ్వతముగా లోచనములు మూసుకొని యుండునని తట్టుచున్నది.

(శ్రీదత్తుడు త్వరితగతిని వచ్చును)

శ్రీద—ఓసీ! పాతకి! ఇం కెక్కడికి పోగలవు? (లీలావతి మొకబట్టి కత్తితో పొడవబోవ తలపాగా నేలబడును, (శ్రీదత్తుడు నివ్వెరపడి ఇంచుక తాళి) ఎంత మోసము, ఎంత మోసము! లీలావతీ, ఆద్యంతమూ నిజము పల్కెదవా? లేక చచ్చెదవా?

లీలా—బలే- మహాశూరుడవే - నన్ను చంపెదవా? చంపు.

శ్రీద—అంతేకాని నిజము నీనోట రాదేమి?

లీలా—చంపదలచినచో వద్దనను, కాని తత్పూర్వము మీకు సంతసముగూర్చు కొన్ని సంగతులు చెప్పెదను. ఇష్టమున్న వినవచ్చును, లేదా ఈ క్షణమే చంపవచ్చును. నా కెట్టి అభ్యంతరమూ లేదు.

శ్రీద—ఓసీ, రంపెలాడీ! ముందా సంగతులు చెప్పిపిదప చావవచ్చును-(కత్తి క్రింద పడవేయును)

లీలా—యువ రాజవతంసమా! నీ ప్రియురాలైన సావిత్రి నా చెల్లెలగు సులోచనకాని వేరు కాదు.

శ్రీద—నీ కెట్లు తెలియును?

లీలా—మీ రామెనిచ్చి వివాహముచేయ మా జననీ జనకులు సమ్మతించిన నాటి రాత్రి సులోచన నిద్రపోతూండగా ఆమె నడవికి తీసుకొనిపోయి చంపివేయుండని హంతకులకు ఆజ్ఞయిచ్చి, ఏపాపమెరుగని దానిపై దోషము నారోపించి మావారందరు ఆమె యెడ రోతపడునట్లు గావర్చి, ఘాతకుల బారినుండి ఆమె తప్పుకొని మీభవనమున సుఖముగా జీవించడము చూడలేక లేనిపోని కల్పనలచేత భయపెట్టి అచ్చటనుండి తరిమి, ఆమె మీకువ్రాసిన యుత్తరమున తొమ్మిది నాకుచేసి మీతో సహవేశము గడించి, మీ రామె కొసగిన ఉంగర మపహరించి, దానిని ప్రతాపశీలున కిచ్చి మీకనుమానము పుట్టించనెంచి, పురుషవేషమున నామె నరస మెలగి మీమానసమును కల్లడిల్ల చేసినదానను నేను— లీలావతిని—సులోచన సోదరిని.

శ్రీద—ఓసీ జగజంతీ! ఇంత దుర్వ్యాపా మోదుకు పన్నినావు?

లీలా—యువరాజా! నీ వెగుగవా ప్రణయాపహత చేతస్కు లెంత దుష్కంతముకైనా వెనుదరు. ఆనాడు నిండోలగమున నన్ను వివాహము చేసుకొనెనని పట్టుబట్టి తరువాత నేనెంత వేడుకొన్నా నన్ను తిరస్కరించడమే దీని కంతకూ

మూలకారణము.

శ్రీద — అన్నా! (స్వ) ఎంత ప్రమాదము సంభవించెను. అమాయకురాలగు నా ప్రియురాలిని కఠినలోకము డీపాటి ఖండించి యుంచనేమో సదా! అయ్యో ప్రేయసీ! . (వెళ్ళును)

లీలా — ఈపాటి సులోచన స్వర్గస్థురాలగును. ఆమె మరణించినంతనే ఈతడూ బ్రతుకడు . ఇంక నేను చేయవలసిన దొక్కటే యున్నది-ఆలస్యమేల? (కత్తితీసి) కార్యకలాపము నేననుకొన్నట్లు జరుగలేదు-కొంత విపరీతమైయింది-అయినా బొత్తిగా చెడలేదు-నన్నింత దుస్థితికి తెచ్చినవాళ్లకు నావలెనే దుఃఖము మూడజేసితిని... కావున నా ప్రయత్నము సంపూర్ణముగా నిష్ఫలము కాలేదు. . ఇంక నేను జీవించిన ఫలము లేదు-నామనోవ్యాధికి తగినమందు ఖడ్గప్రహారమే! ... ఈ వేషము మార్చుదునా లేక ఇట్లే యుందునా? అధ్వాన పరణ్యమున చచ్చిన నేమియవమానము ఘటిల్లునో?-గొప్పెడంత బలగమున్న నేను గతిలేనిదానివలె దిక్కులేని చావు చావరాదు ..అదీ కాక- ఒక వేళ సులోచన బ్రతికియుంటే వారందరతివైభవముతో దానికి పెళ్ళిచేయుదురు-అట్టి శోభాకరమైన సగరున ఆత్మహత్య కావించినచో పెళ్ళి కానే కాదు. అదే చాలు-చేయదలచినపని చక్కగా చేయువలెను —

## —• నాలుగో రంగము •—

(అంతఃపురములో అర్ధరాత్రి లీలావతి ఒకచేతిలో కటారి వేర చేతిలో నుత్తరమూ పట్టుకొని ప్రవేశించును)

లీలా—సులోచనకు నేనుచేసిన అపకారముల కన్నిటికీ తోడు ఈమాత్రము మేలు చేస్తాను-ఈ యుత్తరము మాతండ్రి గారికి కనబడితే అతడు నన్ను కూతురునిగా నెంచడు, నిజమే కాని సులోచనయెడ సుముఖుడై కోపమంతా ఉపశమించు కొనును. అదే నేను చేయదలచిన సత్కార్యము .. కావున ఈయుత్తర మందరికీ కనబడేలాగు ఇక్కడ పడవైచెదను. .. (అట్లుచేసి) ఔరా! నాజీవిత మీరీతిని అంతమౌనని యెన్నడూ తలచలేదు .. ఇప్పుడు వగచి యేమి ప్రయోజనము? మొదటనే యుండవలసిం దీబుద్ధి .. నాకురాలోచనమే నాదుర్గతికి హేతువు. అనన్య సామాన్యమైన నాయుక్తి, నావివేకము నేమైనవి! ఇవేకదా నన్నీగతి కీడ్చితెచ్చినవి! .. చెడవకురా చెడేవు! అనడానికి నేనే తార్కాణము-నాబుద్ధి సత్కార్యముల యందు వినియోగించియుంటే నాకీగతి పట్టియుండునా? సులోచనలాగు శత్రువులకూ మేలు కోరియుండేటట్లయితే నేనూ సుఖపడే యుందును-విత్తొకటి వేస్తే చెట్టు మరొకటి మొలుస్తుందా? చేసిన కర్మఫల మనుభవించక తీరదు. ఇతరులకు కీడొనర్ప దలచిన నాకు సమకూరిన మేలేది? అట్లైయుండిన

కొంతశ్రేయ మనిపించును. నేను పుట్టినానన్న నిందేది? నా వంటిది పుట్టకుండడమే యుక్తము. బ్రతికియుండి బావుకొనే దేమిటి? ఎంతశీఘ్రముగా చస్తే అంత మేలు. సులోచన అదృష్ట వంతురాలు, ఒకవేళ బ్రతికియుండెనా, నేనెంత చెడ్డదాని నైనా నాకొరకది వగచుట నిశ్చయము-చెల్లెలా, చిన్నదాన వైనా సుగుణవతివి కావున నీవే గెల్చినావు; పెద్దదానను బుద్ధిమతిని, గడుసుదాన నని విర్రవీగిన నేనే వీగినాను. ఒక రిని చెడపనెంచినవాళ్ళు తామే చెడుదురు అనడానికి ప్రత్యక్ష ప్రమాణము నేను...నేనిక బ్రతికియుండడము నాకిష్టము లేదు కాని నేనెవరికి హాని చేయబూనితినో వారిని క్షమాభిక్ష యాచింపనైతినికదా అనేకొరత ఉండిపోయింది. దీని కేయు పాయమూ తోచకున్నది.... చెల్లెలా,సులోచనా, నీవు ఎరుక లేమినైనా నాకెన్నడూ ఒకకీడైన తలపవైతివి. నేనో మనఃపూ ర్వకముగా నీకొకమేలైన చేయనుద్యమించలేదు...నీయోగక్షే మములకు ప్రతికూలముగా నడుముకట్టి నిలిచి తుదకు ప్రాణ భంగము కల్పించడానికైనా వెనుకతీయలేదు. . అట్టినాకు నిన్ను క్షమాభిక్ష యాచించడమునకు మొగము చెల్లునా? కారణ మేమని చెప్పెదను.. ఒక్కటే యున్నది. ఎంతద్రో హినైనా నీకు తోబుట్టువును, పెద్దదానను- అందు చేతనైనా నాతప్పులు సైరించవా? నీకు దైవబలమే ఏకాశ్రయము, అదే నీయాపదలనెల్ల రూపమాపగలదు....నీవు నీప్రియుడు శ్రీదత్తుని పెండ్లియాడి,సిరిసంపదల కాలవాలవై మనబంధువు

లానందింప, లోకులెల్ల నుతింప, నీభర్త ఎన్ని లాలింప చిరకాలము రాణివై వర్ధిల్లి కీర్తి గాంచుదువుగాక!... నన్నెపుడైనా తలచుచుండుము....శ్రీదత్తా! నీమీద నాకుజనించిన కామమోహములే నాకు మత్సర ముదయింపజేసి దుష్ప్రవృత్త్యావేశ మొనర్చి నాకీస్థితి ప్రాప్తింప జేసినవి. అదినీ నేరము కాదు- నీచిత్తవృత్తి నెరుగనివారి సమీపదృష్టియే నాకొంప ముంచినది. నాదుష్ప్రవృత్తికి తగిన దండనము నేననుభవిస్తూన్నాను-అబలను, అజ్ఞానురాలను, మోహావిలమానస నగుటచేత నీయెడ నత్యాచార మొనర్చితిని. దానికై నన్ను మన్నింప వేడుచున్నాను. నీకుతగినది సులోచనగాని నేనుకాను. ఆమెయు మేముచున్నా శోకింపనట్లు లామెయెడ వర్తించుచూ పుత్రపౌత్రసౌభాగ్యము నొంది చిరకాలము పుడమి పాలింతువుగాక!...తల్లిదండ్రులారా! వృథాగా మీమనస్సులు పుండు పడ జేసినాను-అమితపరితాపముపాల మిమ్ము పడవైచినాను, నన్ను క్షమించుడు; మీకు తగినకూతురు సులోచనే-నా పేరుగల కూతురు రనలే పుట్టలేదనుకొని యావత్ప్రేమ నామెయందు సంక్రమింప చేయండి....దత్తవక్రా, దుర్మతీ, మీప్రాణములూ నామూలముననే పోయినవి, నన్ను క్షమించండి... లోకులారా! ఒరులకు కీడొనర్పదలచువారికి భగవంతుడు కీడే సమకూర్చును—చెరపదలచిన వాళ్లకు తాత్కాలికసుఖము చేకూరుట నిజము, కాని అది చిరస్థాయికాదు; అంతమున నదియు నళించి సహస్రగుణముగా కీడుమూడ జేయును..

శ్రీధరత్తా, నీవు నా పరితాప సమార్పకమ్మా నీయూరి నాతుకొం నంతాపహార్ప చిత్త శాంతిని చేకూర్చుతున్నది—

(పోదురు రోనుచు)

---

## అయిదో రంగము

---

(సులోచన మంచముపై పరుండ కమలాకరుడు మెల్లగా వచ్చును)

కమ.—తుద కింతగతి పట్టెనా నాకు! ఎరిగిఎరిగి ఏపాపమూ చేయలేదు-హాతవిధీ! ఈ ఘోర పాతక మొనర్చుమని నానుదుట వ్రాసినావా? ఈసంకటావస్థయందు నేనేమి చేయగలను? ఈనారీరత్నమును నేను చంపినచో అమాయికయగు అబలను చంపినపాపము నామెడకు చుట్టుకొనునే! దానినుండి నాకు మోచన మెట్లు లభింపగలదు?... మొదట నీహత్య చేయడ మేలాగు? తలచుకొన్నంతమాత్రమున తనువెల్ల కంపిస్తున్నది. చంపిన ధర్మద్రోహము చంపకున్న మిత్రద్రోహము, రాజద్రోహము-ఆతనియాజ్ఞ నిర్వహింపక ఆతనిమొదుట పడలేను-పడితినా తనయాజ్ఞ వ్యర్థమాయెనని ఆతడు ప్రాణములు విడుచును, అదిగాక నేను బ్రతుకలేను; ప్రియుడు మరణించెను కదా అని ఈసాధ్వీమణి జీవింపదు-ఈహత్యాపరంపరవలన జనించిన పాప మెవరిది? నాదే కదా! అన్నా! నాఅవస్థ యెటు జూచినా దుర్భరమే—ఊరక యిట్లు పరిదేవనముచేసిన ప్రయోజనములేదు...ఇంక దాలోచన అనవసరము—నే నాల

సిస్తే ప్రమాదము వచ్చునేమో? ఈమెను చంపి నేను హత్య కావించుకొందునా? ..నా మరణవార్తకైనా నామిత్రుడు విని సంహించగలడా? అతని గతిజాలిగుండె... ఈమెయెడ నాతనికి జనించిన అనుమానము కేవల భ్రాంతిజనిత మనుట నిశ్చయము...ఐనా నామిత్రునికి బాసయిచ్చితిని, ప్రమాణము చేసితిని...అహా, ఆత్రికుల యువరాజెంత ఘోరకృత్యమునకు నన్ను ప్రేరేపించినాడు. నన్నెంత కట్టడ చేసినాడు! ..మిత్రమా, నీ అవిమృశ్యకారితవల్ల ఎట్టి ఆపదలు మూడనున్నవో యించుక యోచించితివా? కార్యము మించిన పిమ్మట ఎంత చింతింతువో! ఔదార్యవారు లేక శోకావేగమున నెట్టి దురంత మాచరింతువో!...రాజద్రోహము చేయనా, ధర్మద్రోహమునకు కడంగనా?...మొదటిది నిస్సంశయము రెండవది అనిర్ణీతము-అది చర్చించుటకు నే నవకాశము కాను-యువరాజుకన్న నాకెక్కువ తెలునుగా? ఇందు ప్రమాదవశమున నేను వెనుకతీసితినా నా కిహమునందే అవమానము సిద్ధము. రాజద్రోహము చేయు మానవుడు దేశమునకు శత్రువు. సర్వప్రపంచమునకూ శత్రువు-ఇక పరమా? అంధకారావృతమే. కావున నామిత్రునాజ్ఞ నెరవేర్చి తీరెదను, అందలి ఫలానుభవ మాతనిదే...ఎంత సరిపుచ్చుకొన్నా ఈకార్య మొనర్చుటకు ధైర్యము పూనలేకున్నాను. తెగించెదను. (మంచముదరికి పోవును)

ఆహా! యీమె మొగమున అమాయికత్వము తాండవ

శ్రీదత్తా, నీవు నా పరితాప మార్పుకున్నా, నీకిటారి నాకుగల సంతాపమార్పి చిత్తశాంతిని చేకూర్చుతున్నది—

(పాడుచు పోవును.)

---

—• అయిదో రంగము •—

---

(సులోచన మంచముపై పడుండ కమలాకరుడు మెల్లగా వచ్చును)

కమ—తుద కింతగతి పట్టెనా నాకు! ఎరిగిఎరిగీ ఏపాపమూ చేయలేదు-హతవిధీ! ఈఘోరపాతక మొనర్చుమని నానుదుట వ్రాసినావా? ఈసంకటావస్థయందు నేనేమి చేయగలను? ఈనారీరత్నమును నేను చంపినచో అమాయికయగు అబలను చంపినపాపము నామెడకు చుట్టుకొనునే! దానినుండి నాకు మోచన మెట్లు జరుపడగలను?... మొదట నీహత్య చేయడ మేలాగు? తలచుకొన్నంత గాత్రమున తల వెల్ల కంపిస్తూన్నది. చంపిన ధర్మద్రోహము చంపకున్న మిత్రద్రోహము, రాజద్రోహము-ఆతనియాజ్ఞ నిర్వహింపక ఆతనిమెదుట పడలేను-పడితినా తనయాజ్ఞ వ్యర్థమాయెనని ఆతడు ప్రాణములు విడుచును, అది చూచి నేను బ్రతుకలేను; ప్రియుడు మరణించెను కదా అని ఈసాధ్వీమణీ జీవింపదు-ఈహత్యాపరంపరవలన జనించిన పాప మెవరిది? నాదే కదా! అన్నా! నాఅవస్థ యెటు జూచినా దుర్భరమే—ఊరక యిట్లు పరిదేవనముచేసిన ప్రయోజనములేదు...ఇంక నాలోచన అనవసరము—నే నాల

సిస్తే ప్రమాదము వచ్చునేమో? ఈమెను చంపి నేను హత్యా కావించుకొందునా? ..నా మరణవార్త నా నామిత్రుడు విని సంహించగలడా? అతని గతిజాలిగుండె... ఈమెయెడ నాతనికి జనించిన అనుమానము కేవల భ్రాంతిజనిత మనుట నిశ్చయము...ఐనా నామిత్రునకి బాసయిచ్చితిని, ప్రమాణము చేసితిని...అనా, ఆత్మీయుడవ యువరాజెంత ఘోరకృత్యమునకు నన్ను ప్రేరేపించినాడు నన్నెంత కట్టడ చేసినాడు! ..మిత్రమా, నీ అవిమృశ్యకారితవల్ల పెట్టు ఆపదలు మూడనున్నవో యించుక యోచించితివా? కార్యము మించిన పిమ్మట ఎంత చింతింతువో! ఔదార్యవారు లేక శోకావేగమున నెట్టి దురంత మాచరింతువో!...రాజద్రోహము చేయనా, ధర్మద్రోహమునకు కడంగనా?...మొదటిది నిస్సంశయము రెండవది అనిర్ణీతము-అది చర్చించుటకు నే నర్హుడను కాను-యువరాజున్న నా కెక్కువ తెలుసునా? ఇంత ప్రమాదవశమున నేను వెనుకతీసితినా నా కిహామునసే అవమానము సిద్ధము. రాజద్రోహము చేయు మానవుడు దేశమునకు శత్రువు. సర్వప్రపంచమునకూ శత్రువు-ఇక పరమా? అంధకారావృత మే. కావున నామిత్రునాజ్ఞ నెరవేర్చి తీరెదను, అందలి ఫలానుభవ మూరానిదే...ఎంత నరిపుచ్చుకొన్నా ఈకార్యమున గృడమునకు ధైర్యము పూరలే కున్నాను. తెగించెదను. (మంచమునదరికి పోవును)

ఆహా! యీమె మొగమున అమాయికత్వము తాండవ

నూరానూతూన్నది. ఈమెనుజూచి ఎట్టిఘోరాత్ముడైనా ఈమె ముఖచంద్రునకు పాపకళంకమున్నదని ఊహింపలేడే!...తల్లీ! నిన్నుబోలు సాధ్వీమణిని నిశ్శేషముచేయ నేడుదెంచిన నేనె ట్టిపాపిని! ఎంత ద్రోహిని! అమ్మణీ! నిన్నుచంప నాచేతులా డకున్నవి-మనసు జొప్పకున్నది. నిద్రించునిన్ను చంపి మీఁర రాని అపదూరుపాలౌటకే కత్తి నెత్తుచున్నాను. పతివ్రతవగు నీకీపాటు గారాదు- కులదేవతలుధర్మదేవతలూ నిన్నురక్షింప రాకున్నారు. ఇదే నీజీవితము దాఖరుతుదము. (కత్తినెత్తును)

(శ్రీదత్తుడు వడిగున వచ్చును)

శ్రీద—తాళు, తాళు, కమలాకరా! (కమలాకరుని చేయి పట్టుకొని తెలివితప్పి మంచముపై వాలును, సులోచన ఉలికిపడి లేచును)

సులో—ఇదేమి విడ్డూరము! ఎవరిది! నా ప్రియుడే!

శ్రీద—ప్రేయసీ! నేనే! నీయెడ నెంత ఘోరమాచ రింపబూనితిని! (కమలాకరునితో) కమలాకరా! మిత్రుడ వన్న నీవే-నా ప్రాణములు నిల్పెడమే కాక నన్ను తరింప రాని నరకయాతన నుండి తప్పించితివి...నీవు చెప్పినదంతా నిజము. అందొక అక్షరమైనా పొల్లుకాదు. నేనాద్యంతమూ భ్రమపడినాను. నీవింతవిమర్శించక నావలెనే వేగిరపడియుంటె వేని ఎన్నో హత్యలు మరణములూ సంభవించియుండును. నా తప్పునకు తగిన శిక్ష దుర్భరమైన వేదనరూపముగా నను భవించినాను.

సులో—మీ మాటలు నాకు వింతగా తోచు చున్నవి. భ్రమయేమిటి? వేదనయేమిటి? ఇవి మీ కెట్లు కలిగినవి?

శ్రీద—మిత్రమా, నీ ఋణము నా ప్రాణమర్పించీ తీర్చుకొనలేను

కమ—సరిసరి. మీరు నాకొనర్చిన మే లంతకన్న తక్కువదా? ఒక్కక్షణము మీరాలసించినట్లైన నేను శాశ్వతముగా ఘోరనరకమున మునిగియుండుదును, ఆముప్పుతప్పించి మీరు నాకొనర్చిన మేలునకు మితియున్నదా?...సరే, దాని కేమికాని ఇకముం దెప్పుడున్నూ చక్కగా విమర్శించి కాని సావిత్రిపై నేరము మోపనని బాసజేయుండి, నా కంతేచాలు.

శ్రీద—అవశ్యముట్లే చేసెదను. ఒకసారి శాస్తియైంది చాలదా? ఇంకెప్పుడూ ఈమెయెడ నే కాదు, యెవ్వరి యెడనూ కూడా ఊరక సందేహపడను, దైవమే సాక్షి.

సులో—మీ ప్రసంగము నాకు బోధపడలేదు.

శ్రీద—అంతా సవిస్తరముగా వింటువు, కొంచెము తాళుము. కమలాకరా, ఒకమాట-నేను సావిత్రియను దాసిపైని కదా అనుమానపడితిని-పోనిమ్ము-పరాక్రమకేతు మహారాజు కూతురగు సులోచనను అచిరకాలమున వివాహమాడ నున్నానని ఊరెల్ల చాటింపుము.

సులో—సులోచన ఎక్కడుంది?

శ్రీద—మోహినీ! నీ వింతకాలము నావద్ద నిజమేల దాచినావు? ముందే నీ నిజనామ మెరిగించియున్న నీ కిన్ని

కష్టాలు మూ[illegible]నా!

కను—ఔరా! ఈమె సులోచనాదేవి కదా?

శ్రీద—ఇదివరకు సావిత్రీ నాప్రియురాలూ, ఇప్పుడు సులోచనా నాదేవియూ నైనదీ స[illegible]కమే!

(పరాక్రమకేతూ కాంతిమతియు వత్తురు. సులోచన బిరానపోయి తల్లిని కాగిలించుకొనును).

కాంతి—అమ్మా, సులోచనా, నిన్నైనా నాప్రాణ ముండగా చూడగల్గినాను. నీవూ మరణించితే ఇక నాగతి యేమవును. తల్లీ! నేను నీవు నాకడుపులో పాలు పోసినావు. ఇక్కడనే ఇన్నినాళ్లునుంచీ ఉన్నావని ఎవరితోనైన చెప్పి పంపకూడదా? నీవు నేడొక గొప్ప యాపదనుండి తప్పి జీవించ డము మేము చేసుకొన్న పుణ్యమే.

పరా—యువరాజా! ఆత్రమున నాజ్ఞ యిడజెల్లునా? దైవవశమున ఆముప్పు తప్పింది కాని లేకున్న మేమందరమూ మడిసిపోదుమే. మీా కనుమానము తట్టినవెంటనే నిజమారయ యత్నించవలెను కాని భ్రాంత్యావేశులై ఉపసంహరింపరాని ఆదేశ మొనర్పజెల్లునా?—ఎప్పుడూ నిజము నిలకడపై తెలి యును...అయ్యో! లీలావతీ!

కాంతి—(అపవారించి)ప్రాణేశా! ఆవృత్తాంత మిప్పుడు తలపెట్టరాదు. పాప మీా సులోచన వట్టిగోల, బెంగగొని ఏమి చేయునో? కాలక్రమమున ఏలాగూ తెలియకమానదు. ఇప్పుడు తొందరయేల?

పరా——నిజమే-(శ్రీదత్తునితో) రాకుమారా! లీలావతి మరణవార్త యిపుడు వెల్లడిచేయవద్దు. అది సులోచన కమితతాపహేతు వగును. క్రమక్రమముగా తెలిసినా ప్రమాద ముండదు.

శ్రీద——ఏమి? లీలావతి మరణించెనా?

పరా——తనవృత్తాంతము సాంతముగా నొకలేఖలో వ్రాసిపెట్టి ఆత్మహత్య కావించుకొన్నది.

సులో——అక్క లీలావతి ఏది?

కాంత——చెప్పెదను రా-చక్రవర్తి మొదలైనవారెల్ల వత్తురు మన మిట నుండరాదు.

(వాసవదత్తుడు, చిత్రరేఖ, పద్మాక్షియు మొదట వత్తురు పిదప గుణసేనుడు విచిత్రవర్మ వత్తురు. శ్రీదత్తుని తండ్రియూ సులోచనను పద్మాక్షియు కౌగిలింతురు.)

వాస——శ్రీదత్తా! నీ గుప్తప్రేమ ఎవ్వరూ ఎరుగరు. సులోచన యిచ్చట నుండదనీ, ఆమె నీచిత్తము నాకర్షించిందనీ నాకు తెలిసియుంటే నేను మందానందమున మీ వివాహమునకు సమ్మతింపనా? ఇంత వైమనస్యమునకు చోటుండునా? ఈమెనే మునుపట నీకు నిర్ణయించినాము.

శ్రీద——జనకా, ఇది నా నేరముకాదు-ఈమె సులోచనఅని నాకీనాడే తెలిసింది.

పద్మా——సులోచనను యువరాజు చూచినతోడనే ప్రేమించితీరునని నేను మొదటనే చెప్పితినే! ఇం దబద్ధమే

మున్నది ? దైవకృపవల్ల అంతా సానుకూలముగానే జరిగింది ఇంక వివాహప్రయత్నము సలుపవచ్చును.

వాస—అట్లే చేదాము.

పరా—చూచినావా ప్రేయసీ, మనకళ్ళయెదుటనే వీరు సులోచనా వివాహము రూఢముచేస్తున్నారు !

వాస—మీా కీసంబంధము సంపూర్ణాంగీకారమే అని నాకు తెలుసును-కనుకనే శుభస్య శీఘ్రమ్మని నిశ్చయించితిని.

పరా—మాటవరుస కంటిని కాని మీాసంబంధము చేయడాని కభ్యంతరమేమి ?

విచి—(రహస్యముగా) గుణసేనా, ఈ రాకుమారి పేరేమి ?

గుణ—ఇదెరుగవా ? సులోచన.

విచి—మహారాజా ! చూచినారా ఒకచిత్రము. ఇంతకుముందు యువరాజుగారితో వివాహప్రసంగము చేస్తే "ఈలోకమంతా మాయవలె కానవచ్చుచున్నది, దరిదాపు కానరాలేదు, నాకు వివాహమే అక్కరలేద"ని చెప్పేవారు-ఇప్పుడు సులోచనాసంసర్గమువల్ల దృష్టి దారిలో పడ్డది, ఏమి, యోగీశ్వరా, ఇప్పుడు ప్రపంచము సుందరముగా కనబడుతూన్నదా ?

శ్రీద—విచిత్రశర్మా-నీహాస్యమునకు తగిన అనువు దొరికింది.

విచి—ఇప్పుడు కన్నులు బాగా కనబడుతూన్నవా ?

తిక్క తిరిగిందా ?

శ్రీద—మాతృశ్రీ ఉపదేశము సత్యమని ఇప్పుడు గ్రహించగలిగితిని-నావంటివారు బ్రహ్మచర్యమునుండి సన్యాసించడము అసాధ్యము, ప్రమాదజనకము-కొంతకాలము గృహస్థునై అటుపిమ్మట తురీయాశ్రమస్వీకార మొనర్పవలెను.

కమ—మీతల్లిగారి కీశోభాపూరితమైన సమయమున లేకపోవుట గొప్పలోపమే.

శ్రీద—ఆమె స్థూలశరీరమున దీనిని జూడకున్నను, వారి యాత్మ కిది గోచరము కాకయుండదు.

వాస—శ్రీదత్తా-నీవు నేడు తిరిగీ నాగర్భవాసమున జనించితివని యెంతును.

"సుతుడు తండ్రికిజేయు శోభ, జనకుని తపో
వ్రతమెట్టిదో యనగ బడుట"

నీకర్తవ్యమును నేడే నెరవేర్చినావు-నీ మహిమ గనలేక నిన్నెన్నో రీతుల దుఃఖములపాలు చేసినాను. నాతప్పు సైరించుము.

శ్రీద—అది నేననవలసిన మాట.

వాస—ఇంతవరకు కార్యకలాపము మోదాంతము కావడము మన పూర్వకర్మఫల మనుకోవలెను.

విచి—అందరికీ మోదాంతమేకాని పాపము ప్రతాపశీలునికీ, విక్రమవీరశూరధీరునికీ మాత్రము ఖేదాంతమే.

శ్రీద—వా రేమైరి ?

విచి—పట్నమునుండి పరారులైనారు.

వాస—“చెడపకురా చెడేవు” అన్నట్లు వారిదుర్బుద్ధి వారికే విషమించింది. వారీదేశమున నుండరాదని ఆజ్ఞాపించినాను. ఇక మన మంత్రఃపురమునకు బోవు ముందుయత్నములు చేతాము-శ్రీదత్తా, నీవృత్తాంతము టూకీగా తెలిసింది, సవిస్తరముగా మాకందరికీ వినవలెనని కోర్కెయుంది, రమ్ము.

శ్రీద—మీరు నడుస్తూ ఉండండి, నేను నామిత్రులవీడ్కొని వస్తాను. కమలాకరా, భగవన్మహిమ గంటివా? పరమేశ్వరా! దీనదయాళూ!

అంతయును నీసొత్తె అంత నీబానిసమె
  అన్నియును నీదుచెయ్వుల్;
ఎల్లెడల వ్యాపింతు వెలుగత్తి వేదంబు
  లెల్లనిది చాటు సతము౯;
కల్ల నిజము నెరుంగగలవాఁడు చెప్పేది
  జ్ఞానంబు నిదియె సుమ్మి.
తొల్లింటి గురువరులు తోరంబుగా జెప్పి
  తోడ్పడిన త్రోవ యిదియే.
కల్ల జగమెల్ల యని గట్టిగా నెరిగియును
  జ్ఞానహీనునిపగిది నుంటిన్,
సల్లలితమైన సుఖసాగరము గానసైతి,
  స్వామి యిదె హేతువయ్యా;
వల్లభుడ యిదియు నీవరకృపయె సుజ్ఞాన

వంతుడగు నపతితునిలో

నల్లనను. తెల్పినవయ్యా ? నా కేగతియు

అదియు నీవే చెప్పుమా.

ఘల్లున సకలభువనగణములను కోవెలల

కమనీయ మంటపములఁ

అల్లాగు పదములను నానందనృత్యంబు

లాడు కరుణాకర ప్రభో.

సమాప్తము




ఈ గ్రంథమాల ముఖ్యోద్దేశములు రెండు:—మన వాఙ్మయమందలి నాటకములయందు ఆర్యసనాతనధర్మాదర్శములు చక్కగా నిరూపింపబడలేదు. నాట్యకళాప్రౌఢిగాని, ఆధునికజీవితసమస్యాచర్చగాని, నాగరికరుచిసామంజస్యముగాని తరుచుగా లేవు.

మనవాఙ్మయమున విమర్శగ్రంథము లసలే తక్కువ; అందుచేత చదువరులకు గ్రంథతారతమ్యము నెరుగుటకు వీలులేదు. కవు లుత్తమగ్రంథములను రచించుటకు పాటుపడక ధనార్జనమే పరమపురుషార్థమని యెంచి తుచ్ఛపుస్తకములు వ్రాయుచున్నారు.

ఈ రెండులోటులు పూటుచేయుటకు మనదేశభాషల (బంగాళీ, హిందీ, మహారాష్ట్రి, ఉర్దూ, ఓఢ్ర, తమిళ, కన్నడ, ఇంగ్లీషు, ఫ్రెంచి, పంజాబీ) నుండి నాలుగురకముల ఉత్తమగ్రంథములు తెనిగించి ఉత్తరాయణమున మూడు దక్షిణాయనమున మూడు చొప్పున ప్రకటింతుము చందా పోష్టుఖర్చులతో సహా సాలుకు రు 6—0—0 లు. ఆంధ్రమహాజనులు మాతృభాషయందలి గౌరవము చేతనూ, ఉత్తమాదర్శగౌరవము చేతనూ, సారస్వతాభివృద్ధిచికీర్ష చేతనూ మాకు తగిన ప్రోత్సాహ మిచ్చుటకు ప్రార్థితులు.

## ఇప్పటికి వెలువడిన గ్రంథములు

### నాటకములు

1. చంద్రగుప్త 1— 4—0
2. సోరాబు రుస్తుములు 0—12—0
3. భారతరమణి 1— 0—0
4. సీత 1— 0—0
5. రాణాప్రతాపసింహ 1— 4—0
6. శివాజీశీలము 1— 0—0
7. లీలావతీ సులోచనలు 1— 0—0
8. బిల్వమంగళ 1— 4—0
9. శ్రీమాధవాచార్యవిద్యారణ్య 1—4—0

### విమర్శ

1. సాహిత్యమీమాంస 1—4—

### ప్రబంధము

1. శ్రీజగన్నాథమాహాత్మ్యము 0-12-

### ప్రహసనములు

1. కొత్తల్లుడు 0—4—
2. గడుసు గంగయ్య [illegible]

మేలు ప్రతులూ సాదాప్రతులూ కలవు.

చందాదారులకు పుస్తకములు తక్కువ వెల కివ్వబడును.

ప్రకాశకుడు